హైదరాబాద్
భవిష్యత్తుపై
ఢిల్లీలో సంప్రతింపులు

3 వ పేజీ

# ఆంధ్రపత్రిక

విజయవాడలో 11
దుక్కాల వాన: రాక
పోకకు ఆటంకం

5-వ పేజీ

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 35 No. 212 FRIDAY 5th NOVEMBER 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

# హింసాద్వేషములకు స్వస్తి చెప్పినవే ప్రపంచశాంతి సాధ్యం

## అమెరికా అధ్యక్షుడుగ ట్రూమన్ ఎన్నిక

### డ్యూయి ఓటమి

### డెమొక్రాట్ పక్షంలో ప్రజల విశ్వాసం

న్యూయార్కు, నవంబరు 3: అమెరికా అధ్యక్ష స్థానమునకు అతి తీవ్రమైన పోటీతో నిన్న జరిగిన ఎన్నికలో డెమోక్రెటిక్ పక్ష అభ్యర్థి ప్రస్తుత అధ్యక్షుడు అయిన ట్రూమను విజయము పొందినట్లు, ప్రత్యర్థులలో ప్రముఖుడు, రిపబ్లికన్ పక్ష ప్రతినిధీ అయిన న్యూయార్కు గవర్నర్ థామస్ డ్యూయి ఓడిపోయినట్లు ఉభయులకువచ్చిన ఓట్ల వివరములవల్ల నిర్ధారణ అయినది. ప్రెసిడెంటు ట్రూమన్‌కే విజయము లభ్యమైనదని థామస్ డ్యూయి బుధవారము రాత్రి 9 గంటలకు (భారత కాలమానము ప్రకారం) ఒక ప్రకటన ద్వారా అంగీకరించెను. 1916 తర్వాత అమెరికా అధ్యక్షపదవికి ఇంత తీవ్రమైన పోటీ ఎన్నడూ జరుగలేదు.

ట్రూమన్ విజయముతోపాటు అమెరికన్ శాసనసభలైన సెనెటులోనూ, ప్రజాప్రతినిధుల సభలోనూ డెమోక్రెటిక్ పక్షము స్పష్టమైన మెజారిటీని సాధించగలిగినది. మరొక నాల్గు సంవత్సరములపాటు అమెరికాకు ట్రూమన్ నాయకుడుగా అధ్యక్షపదవీ అధికారములను నిర్విఘ్నముగ నిర్వహించగలడు.

## హోపే, సూయియాన్ రాష్ట్రాలపై చైనా కమ్యూనిస్టుల కొత్తముట్టడులు

### ప్రభుత్వసేనలపై పార్శ్వభంగయత్నము: షాన్సీ రాజధానికి ప్రమాదపరిస్థితి

### చైనా మంత్రివర్గ రాజీనామా

నాంకింగ్, నవంబరు 3: చైనామంత్రివర్గ సభ్యులందరూ రాజీనామా ఇచ్చుటకు నిర్ణయించగా ఆ నిర్ణయమును చైనా శాసనసభ కార్యవర్గము నేడు ఆమోదించినది. తాను వ్యక్తిగతముగ ఏ నిర్ణయమునకు వచ్చిననూ మిగతమంత్రులు తమతమ పదవులలో పనిచేయుచుండుట అవసరమని ప్రధాని వాంగ్ వెన్ హావో ప్రత్యేకించి విజ్ఞప్తి చేసిననూ మంత్రివర్గసభ్యులు తాముకూడ రాజీనామా ఇచ్చితీరవలెననే పట్టుపట్టిరి.

మంత్రి మండలి రాజీనామా పత్రపు ముసాయిదాను తయారుచేయు బాధ్యతను మంత్రివర్గ సెక్రెటేరియెట్‌కు అప్పగించిరి. దానిపై మంత్రులందరు సంతకములు చేసిన పిమ్మట రాజీనామా కాగితమును అధ్యక్షుడుచాంగ్‌కై షేక్‌కు అందజేసెదరు.

గతఎన్నికల అనంతరము 1948 మే మాసమున ప్రధానివాంగ్ మంత్రివర్గమును ఏర్పరిచెను.

నాంకింగ్, నవంబరు 3: పశ్చిమ హోపేరాష్ట్రముపైనను, లోపలి మంగోలియా రాష్ట్రమైన సూయియాన్ పైనను కమ్యూనిస్టుసేనలు కొత్త దండయాత్ర ప్రారంభించినట్లు నేడు వార్తలు వెలువడినవి. ఉత్తర చైనాలో పెద్ద ఎత్తున ఉభయపక్షముల బలాబలముల తేల్చివేసే యుద్ధము ప్రారంభమగుటకుపూర్వమే, ప్రభుత్వసేనల పార్శ్వమును రెండుగా చీల్చివేయవలెనను సంకల్పముతో కమ్యూనిస్టులు ఈ కొత్తదాడులకు ఉపక్రమించినట్లు ప్రభుత్వ ప్రకటనలు తెలుపుచున్నవి.

పీపింగ్‌కు 270 మైళ్లు నైరుతిదిశగా వున్న షాన్సీరాష్ట్ర రాజధాని టాయియాన్ నగరపరిస్థితి కమ్యూనిస్టుదాడివల్ల క్లిష్టముగా పరిణమించి ప్రమాదమేర్పడినట్లు తెలియుచున్నది.

హోపేరాష్ట్ర రాజధాని పావోటింగ్ రక్షణకు చైనా ప్రభుత్వము నాల్గు సహాయ సైనికదళములను పిలిపించినదిగా కమ్యూనిస్టుల లక్ష్యములలో పావోటింగు ఆక్రమణ ఒకటి.

లోపలి మంగోలియాలోని సూయియన్ రాజధాని క్వెసూయివద్ద 'భీకర' యుద్ధము జరుగుచున్నదనీ, కమ్యూనిస్టులు ప్రారంభించిన కత్తెరవ్యూహము ఫలించి సేనలు నగర పొలిమేరలను చేరినవనీ వార్తలు వచ్చుచున్నవి. ఈ నగరమును ప్రభుత్వసేనలు పటుతరముగ రక్షించుచున్నట్లుకూడా మరికొన్ని వార్తలు సూచించుచున్నవి.

ఉత్తర చైనాలోని కమ్యూనిస్టుసేనాని జనరల్ లిన్‌పియావో, "గ్రేట్ వాల్" లోని షాన్ హైక్వాన్ కనుమపై ముట్టడి ప్రారంభించవచ్చునని పీపింగులోని సైనిక పరిశీలకులు జోస్యము చెప్పుచున్నారు. ఈ ముట్టడివల్ల పీపింగు టీంట్సిన్ ప్రాంతమునకు ముప్పు తెచ్చిపెట్టుటకు ఉత్తర చైనాలోని ప్రభుత్వసేనాని జనరల్ ఫూటోసో ఇ సరఫరామార్గమును ఛేదించుటకుపీలగును. తూర్పు హోపేరాష్ట్రములో కమ్యూనిస్టు గొరిల్లాల సంరంభము విపరీతముగా ఎక్కువైనట్లు వార్తలు తెలుపుచున్నవి.

కమ్యూనిస్టు సర్వసేనాని జనరల్ ఛూధీన్ అధ్వర్యమున కొద్దిమంది అనుభవశాలురైన సేనాధిపతులు కమ్యూనిస్టు సేనలను నడుపుచున్నారు. మంచూరియాలో మిగిలివున్న ప్రభుత్వసేనలు ఇంక్గో, హులుటావోలలో తమకున్న కడపటి స్థానములనుండి ఖాళీ చేయుచున్నట్లు షాంఘేవార్తలు తెలుపుచున్నవి. బలీయమైన కమ్యూనిస్టుబలాలు మూక్డెన్-ఇంక్గో లమధ్య నిర్గమన మార్గమును ఛేదించినవి.

## "నేటి పరితాపములను తొలగించుటకు గాంధీజీ సిద్ధాంతములే సరియైన సంస్థాపనములు కాగలవు"

### ఐక్యరాజ్యసమితి సమావేశంలో భారత ప్రధానామాత్యుని ఉద్ఘాటన

పారిస్, నవంబరు 3: "ఏమి జరిగినప్పటికీ అనిష్టాలకు లొంగి పోరాదనీ, తత్ఫలితాలకు భయపడరాదనీ మేము తీర్మానించుకున్నాము. కనుకనే మేము స్వాతంత్ర్యమును సంపాదింపకలిగితిమి. నేటి ప్రపంచమును పట్టుకు బాధించుచున్న పీడల తొలగించుటకు భారతస్వాతంత్ర్య సమరసూత్రముల ప్రయోగింపవచ్చును.

"ప్రపంచ బరువుభారమును తగ్గించి పరితాపములను పోగొట్టుటకు గాంధిజీ సిద్ధాంతములు సముచితమైన స్థాపనములు కాగలవు. సుదీర్ఘమైన మా స్వాతంత్ర్య పోరాటకాలమున మా గురుదేవుడు సాధింపవలసిన లక్ష్యములనేగాక, అట్టి లక్ష్యమును సాధించుటకు ఉపయోగించు సాధనముల, అనుసరించు మార్గముల నెన్నటికిని విస్మరింపరాదని ప్రబోధించెను. లక్ష్యము ఉదాత్తమైన చాలదని, ఆ లక్ష్యసిద్ధికి వినియోగించు సాధనలు కూడ అంత ఉత్కృష్టమైనవిగ ఉండవలెనని పదే పదే ఉద్ఘాటించుచుండిరి.

"కనుక మన లక్ష్యం ఏమి అని విచారించడంకంటె మనం మన పనులను ఎలా నిర్వహించుతూ ఉన్నాం అనే విషయమై కొంచెంసేపు ఎక్కువగా విచారించడం అవసరం." అని భారత ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశములో అచట చేరిన 48 రాజ్యాల ప్రతినిధులను హెచ్చరించెను.

ప్రపంచం తీవ్రమైన ఆహారకొరతను అనుభవించుచు, అనేక ప్రాంతములందు ప్రజల ఆకలిబాధకు అలమటించిపోవుచుండ ప్రపంచ రాజకీయవేత్తల దృష్టియంతయు రాజకీయ సమస్యలపై కేంద్రీకృతం కావడం విపరీతముగ నున్నదని పండిట్ నెహ్రూ వెల్లడించెను. ప్రపంచ వ్యవహారాలలో ఆసియా ప్రముఖ స్థానాన్ని గుర్తించి పాశ్చాత్య రాజకీయ వేత్తలు ఇంక ముందు వ్యవహరింపవలసి ఉంటుందని భారత ప్రధాన మంత్రి విస్పష్టం చేసెను.

సమితి సమావేశం జరిగే "పాలెస్ డిషాలెట్" భవనంలో స్వర్ణవర్ణశోభితమైన పొడుగాటి, అందమైన మందిరంలో అధ్యక్ష పీఠానికి 15 అడుగులు దిగువన బంగారు కుర్చీలో పండిట్ నెహ్రూ ఆసీనుడై యుండగా, ఆయన ఏకాంత విగ్రహంపైకి అన్ని దిశలనుండి విద్యుద్దీప కాంతులు కేంద్రీకరింపబడినవి. ఆ క్షణంలో సభామందిరమంతటా గాఢమైన నిశ్శబ్దం ఆవరించినది. అప్పుడు సభాధ్యక్షుడు డా॥ హెర్బర్టు ఇవాట్ లేచి, "ఈ సభలో ఉపన్యసించవలసినదిగా ఇండియా ప్రధాన మంత్రిని ఆహ్వానిస్తున్నాను." అన్నాడు. వెంటనే బ్రహ్మాండమైన హర్షధ్వనులు చెలరేగినవి.

పండిట్ నెహ్రూ లేచి ఉపన్యాస వేదికను సమీపించి, ప్రశాంతంగా, సంగీత మాధుర్యం తొణికిసలాడే కంఠాన్నెత్తి అనువుగా ప్రసంగించుట ప్రారంభించెను. కాలవ్యవధి లేకపోవుటచేత ఆయన తన ప్రసంగమును ముందుగా తయారు చేసుకొనలేదు.

48 దేశాలనుండి వచ్చిన అనేకమంది ప్రతినిధులు పరివేష్టించి ఉన్న ఆ మందిరంలో ప్రతి ఒక్కరూ, అతిహేతుయుక్తమై ఉన్న పండిట్ నెహ్రూ ప్రసంగ

4 వ పేజీ చూడుడు

## "చారిత్రక సంఘటన"

### ఐక్యరాజ్య సమావేశములో నెహ్రూప్రసంగం

### వివిధరాజ్యాల ప్రతినిధుల ప్రశంసలు

పారిస్, నవంబరు 3: నేటి నెహ్రూ ప్రసంగము ఐక్యరాజ్యసమితి చరిత్రలో ఒక అపూర్వ సంఘటన అని రాయిటరు రాజకీయవిలేఖరి ఫ్రేజర్ వైటన్ వ్రాయుచున్నాడు. ఐక్యరాజ్యసమితిలో ప్రత్యేకముగా ప్రసంగించు అసాధారణ గౌరవము పొందినవారిలో రాజ్యాధిపత్యము లేని ప్రధానమంత్రి ఎవరును ఇంతకుపూర్వము లేడు. ఐక్యరాజ్యసమితివారు తొక్కిన ఈ కొత్తమార్గమును పండిత నెహ్రూ ప్రసంగము చక్కగా సమర్థించెనని ఐక్యరాజ్య ఉన్నత వర్గములవారు భావించుచున్నారు.

నెహ్రూ ప్రసంగము ముగిసినతరువాత ఆస్ట్రేలియా ప్రతినిధియైన సర్వసభ్యసమితి-అధ్యక్షుడు ఇవాట్ ప్రసంగానంతరము రాయిటరు విలేఖరితో, "ఇంతటి లోకోత్తరుడు, ఇంతటి శాంతిప్రియుడు ఆసియా తరఫునవేకాక, ప్రపంచము తరఫున మాట్లాడగల ఇంతటి వక్త ప్రసంగించగావినుట సమితియొక్క మహాభాగ్యము." అనిచెప్పెను. పండితనెహ్రూ ప్రసంగము సభ్యులపై బలమైన ప్రభావము కలిగించెనని ఆయన విశ్వసించెను.

"నెహ్రూ ప్రసంగము బుద్ధిగ్రాహకమును, భావోద్దీపకమును అయి, ప్రపంచ సమస్యలను గురించి ఆసియా దృక్పథమును విశదీకరించు ప్రయోజనము గలదిగానున్నది. ప్రపంచ సంస్కృతీ పరిణామమందు ఇండియాకుగల స్థానమును ఈ ప్రసంగము సభ్యులకు జ్ఞప్తికి తెచ్చినది." అని బ్రిటిషు సైనికమంత్రి హెక్టర్ మక్నీల్ చెప్పెను.

"చాలా చక్కని ప్రసంగము. ప్రపంచములో యూరపుమాత్రమే లేదనియూ, ఆసియా కూడా కలదనియు స్ఫురింపజేయ జాలియున్నది. సమితివారి ప్రసంగమునకు అమ్మోరము చెందియుండవలె ననుకొనుచున్నాను," అని లండనులోని సౌదీ అరేబియా రాయబారి, షేక్ హఫీజ్ వాహ్బా అనెను.

## డచ్చి - ఇండొనీసియా సంబంధాల విషమపరిణామం

### యుద్ధ విరమణను ఉల్లంఘించినది డచ్చివారేనని హట్టా ఎదురుసవాలు

బటేవియా, నవంబర్ 3: ఇండొనీసియా రిపబ్లికనులకు, డచ్చివారికీ మధ్య సంబంధములు మరింత అధ్వాన్నముగ పరిణమించినవని రిపబ్లిక్ ప్రధాని డా॥ మహమ్మద్ హట్టా నేడు ప్రకటించెను. నేటి పరిస్థితి, డచ్చివారు రిపబ్లికనులపై సైనిక ప్రయోగమునకుఉపక్రమించిన 1947 జూలై 20 వ తేది జ్ఞప్తికి తెచ్చుచున్నదని కూడ ప్రధాని 'అంతరా' వార్తాసంస్థ ప్రతినిధితో అభిభాషించుచు అనెను.

డచ్చి విదేశమంత్రితో తాను రేపు జరుపబోవుచున్న ప్రధాన సంప్రతింపులు ఈ విషమ పరిస్థితిని కొంతవరకైననూ ఉపశమింప జేయుటకు ఉపయోగపడ గలవని ఆశించుచున్నాననీ, మొత్తముమీద పరిస్థితి ప్రమాదకరముగనే పరివర్తనము చెందుచున్నదనీ కూడ హట్టా తెలియజేసెను.

యుద్ధవిరమణ షరతులను నిష్కర్షగా పాటించుట అవసరమని ఉభయపక్షములను ఆదేశించినట్లు భద్రతా మండలి సామరస్య సంఘము నేడు ప్రకటించినది. యుద్ధవిరమణ సరిహద్దు గీత విషయములోనూ, అనేక దురభిప్రాయములకు దారితీయు రేడియో ప్రసంగముల విషయములోనూ, అట్టివి కూడదని సామరస్య సంఘము ఎక్కువ పట్టుదల చూపుచున్నది. రాజకీయ రాయబారముల జరుపుట వల్ల ఏమైన ప్రయోజన మున్నదీ లేనిదీ, హట్టాతో సంప్రదించిన అనంతరము డచ్చి విదేశ మంత్రి స్టిక్కర్ హాలెండుకు తెలుపగలడు.

ఇండొనీసియాలోని డచ్చి భూభాగముపై సెప్టెంబరు 29 అక్టోబరు 26-వ తేదీల మధ్య మొత్తము 631 'సంఘటనలు' జరిగినవని డచ్చి సైనిక కార్యాలయ ప్రకటన తెలుపుచున్నది. యుద్ధ విరమణ సరిహద్దు సమీపమునసె రిపబ్లికను భూభాగమునుండి ప్రారంభమైన కాల్పులవల్ల రెండుసార్లు సంఘర్షణం జరిగినవని కూడా డచ్చివారు ఆరోపణ చేయుచున్నారు. రిపబ్లికన్ భూభాగములోనికి డచ్చివారు యుద్ధ విరమణ షరతులను ఉల్లంఘించుచు చొచ్చుకొని వచ్చినట్లు లిఖిత పూర్వకముగ ఋజువుచేయగలనని రిపబ్లికన్ ప్రధాని హట్టా దీనికి ఎదురు సవాలు చేయుచున్నాడు. విదేశమంత్రి స్టిక్కర్ అనను కాలముగ తననివేదికను సమర్పించుపక్షమున రిపబ్లికన్ రాజధాని జోగ్జకర్తాపైకి వచ్చి మంత్రివర్గము తమసేనను తరలింప వచ్చునని రిపబ్లికనులు అభిప్రాయపడుచున్నారు.

ఇండొనీసియా లెఫ్టినెంట్ గవర్నర్ జనరల్ డా॥ వాన్‌మూక్ మాజీ డచ్చి ప్రధాని డా॥ లూయిస్ బీల్‌కు తన అధికారమును అప్పగించెను. డా॥ బీల్ నేడు విమానములో ఇక్కడికి చేరెను. ఇతడు ఇకనుండి హైకమిషనర్ హోదాలో పని చేయగలడు.

ముగ్గురు ఇండొనీసియన్ ప్రతినిధులుగల తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వముతో సహకరించుచు డా॥ బీల్ తన అధికార కార్య కలాపములను నిర్వహించుచు.

ఉపాధ్యక్షుడు బార్క్లే

## "ప్రపంచ శాంతిస్థాపనకు జీవితాంకితం"

### ట్రూమన్ సందేశం

కన్సాస్‌సిటీ, నవంబరు 3: ప్రపంచ శాంతి స్థాపనకు, దేశ ఐశ్వర్య సౌఖ్యసాధనకు నా జీవితమును అంకితము చేయుచున్నాను," అని ప్రెసిడెంట్ ట్రూమన్ విజయ వర్తమానము తెలిసినపిమ్మట వాగ్దానము చేయుచు ఒక సందేశమును ప్రకటించెను. "రానున్న నాల్గు సంవత్సరములలో అమెరికన్ ప్రజాశ్రేయస్సుకై నా శక్తికొలది నేను సహాయపడగలను. ఈఎన్నిక ఫలితముగ నాపైపడిన గురుతర బాధ్యతను నేను గుర్తించితిని." అనికూడ ట్రూమన్ ఈ సందేశమున ఉద్ఘాటించెను.

### డ్యూయీ అభినందన సందేశము

ప్రత్యర్థిగ పోటీచేసి ఓడిపోయిన థామస్ డ్యూయి ప్రెసిడెంట్ ట్రూమన్‌ను అభినందించుచు కన్సాస్‌సిటీకి న్యూయార్కునుండి ఈ క్రింది సందేశము పంపెను: "అధ్యక్ష పదవికి ఎన్నిక అయినందుకు మీకు ఇవే నా అత్యంత హృదయపూర్వక అభినందనలు. మీ పరిపాలన జయప్రదముగ నిర్వహింపబడుగాక అని ...

...సు. మనజాతిని బలీయముగను, ...వుంచుటపై మీరు సాగించ...
...నే ఆ క్షేజి చూడుడు)
...త్రి చా
...అం
...గా సెను.

## స్తంభింపజేయబడిన నిజాం సంస్థానబ్యాంకు ఆస్తుల విడుదల

హైదరాబాద్, నవంబరు 3: గతజూలైలో స్తంభింపజేయబడిన హైదరాబాద్ సంస్థానబ్యాంకు ఆస్తులను ఇండియా రిజర్వుబ్యాంకు విడుదల చేసినదని నేడు యిక్కడ తెలియవచ్చినది. ఈ ఆస్తుల మొత్తం దాదాపు 3 కోట్ల రూపాయలు. ఈ ధనం ఇండియన్ యూనియన్ లో నున్న సంస్థానబ్యాంకు బ్రాంచీలలోను, ఏజెన్సీలలోను నిలిపివేయబడినది. అయితే రిజర్వుబ్యాంకు ప్రస్తుతచర్య 'స్తంభింపజేయబడిన ప్రయివేటు కాతాలకు వర్తించదు. ఈ కాతాలమీద లోగడ అమలు జరుపబడిన నిర్బంధములు యింకా కొంత కాలంవరకు కొనసాగును. లోగడ మాదిరిగానే అత్యవసర కార్యములకొరకు దరఖాస్తులమీద యీ కాతాలనుండి ధనం తీసుకొనవచ్చును. హైదరాబాద్ సంస్థాన బ్యాంకు ఆస్తులు విడుదల చేయబడుటతో ఇంపీరియల్ బ్యాంకు, సంస్థాన బ్యాంకుల మధ్య గత జూలై 27 న రద్దుచేయబడిన క్లియరెన్సు ఏర్పాట్లు త్వరలో పునరుద్ధరింపబడలవని తెలియుచున్నది.

## స్వతంత్ర భారత రాజ్యాంగ ఆమోదానికి పరిషత్తు ఆఖరు సమావేశం

న్యూఢిల్లీ, నవంబరు 4: స్వతంత్ర భారత రాజ్యాంగమును ఆమోదించుటకు భారత ప్రజాపరిషత్తు ఆఖరిదఫా రాజ్యాంగ పరిషత్తుగ నేడు సభాపతి డాక్టర్ ప్రసాదుగారి అధ్యక్షతను సమావేశమైనది. ఫిబ్రవరి మాసములో రాజ్యాంగరచన తరఫున అధ్యక్షుడు డాక్టర్ అంబేద్కర్ రాజ్యాంగ ముసాయిదాను పరిషత్తు సమర్పించెను. ముసాయిదాకు వందలకొలది సవరణలు ప్రతిపాదింపబడినవి. ముఖ్యమైన సవరణ 'రిపబ్లిక్' బదులు "స్టేట్" అని డాక్టర్ అంబేద్కరం సూచించిన ... ముసాయిదాను పరిశీలింపవలసినదని కోరుతూ డాక్టర్ అంబేద్కర్ పూర్వ చరిత్రను ...లంగా సమీక్ష చేసిరి.

సభకు నేడు సభ్యులు యించుమించు అందరు వచ్చిరి. క్రొత్తగా ఎన్నుకొనబడిన సభ్యులు ముందుగ ప్రమాణం స్వీకరించిరి. వారిలో సౌరాష్ట్ర ప్రతినిధియగు ఎ. వి. ఠక్కరుబాపాగారు, గాంధీజీకి ప్రియమగు సహోద్యోగులొకరు.

ముందుగ అధ్యక్షులు గాంధిమహాత్ముని మరణమునకై విచారం తెలుపుచు తీర్మానము ప్రతిపాదించిరి. సభవారంతా మౌనంగానుండి లేచినిలచి మహాత్మునియెడ గౌరవంచూపి తీర్మానం ఆమోదించిరి. తరువాత జిన్నాగారి మరణమునకు విచారం తెల్పుచు, తీర్మానించబడెను. ...బడెను. ఈ తీర్మానం ప్రతిపాదించుచు, పాకిస్తాను సృష్టించిన జిన్నాగారి అని పొగడి, సరిహద్దు లవతల నున్నవారికి మన హృదయపూర్వకమగు సానుభూతి తెలియజేయుదమని, అధ్యక్షులు నుడివిరి. సభవారు లేచినిలచి ఆమోదించిరి.

సంస్థానముల ప్రతినిధుల ఎన్నిక పద్ధతిని మార్చవలెనని, యోగ్య డివ ఖాళీలు నూతన ఎన్నిక పద్ధతిని జరిపించాలని కోరుచు శ్రీమతి దుర్గాబాయిగారి ప్రతిపాదన నేడు మొదట చర్చింపబడెను. నెగోషియేటింగ కమిటీ విచారించి నిర్ణయించిన తరువాత సంస్థానములందు చాల మార్పులు జరిగినవనియు, కొన్ని కేంద్ర ప్రభుత్వ పరిపాలన క్రిందచేరి, మరికొన్ని ఐక్యమై ఏక ఖండాలుగా మారినవనియు, యీ మార్పులు యీసభలోనున్న వారి ప్రతినిధుల

(6-వ పేజీ చూడుడు)






# భారత ఆదిమవాసుల వర్కర్ల మహాసభ

## డా॥ రాజేంద్రప్రసాద్‌గారి అధ్యక్షతను సమావేశం

న్యూఢిల్లీ, అక్టోబరు 31: అఖిలభారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్‌గారి అధ్యక్షతను భారత దేశంలోని ఆదిమవాస వర్కర్ల మహాసభ ఢిల్లీలో హరిజనకాలనీ గాంధీ ఆశ్రమంలో అక్టోబరు 24, 25 వ తేదీలలో జరిగెను. మద్రాసు, బొంబాయి, ఒరిస్సా, అస్సాం మధ్యపరగణాలు, బీహారు, ఆంధ్ర, సంయుక్తరాష్ట్రాలనుండి అనేకమంది వర్కర్లు హాజరైరి. 24, 25 తేదీలలో మొత్తం మూడు సమావేశాలు జరిగినవి. రెండోనాటి సమావేశంలో ఈ క్రింది తీర్మానాలు ఆమోదించబడినవి.

భారతదేశం మొత్తంలోని ఆదిమవాసుల సర్వతోముఖాభివృద్ధికై సంస్థాపించబడిన యీ సంస్థను భారతీయ ఆదిమజాతి సేవక్ సంఘం అని పిలుచుటకు నిర్ణయించటమైనది.

ఆదిమవాసులను నాగరిక పౌరులుగా తోటిప్రజల్లో తలయెత్తుకొని తిరిగేలాచేసి అన్నివిధాలా అభివృద్ధికి తీసుకురావలెను. ఆదిమవాసులు యెక్కువగావున్న ప్రాంతాల్లో శిక్షణకేంద్రాలశాలలను స్థాపించి, తద్వారా వర్కర్లకు శిక్షణయిచ్చి ప్రచారాన్ని యినుమడింపజేయుటకును, ఆదిమవాసులకు సంబంధించిన సాహిత్యాన్ని మానవశాస్త్ర పరిశోధనల ద్వారాను, యితర విధాలా సేకరించి ప్రచురణచేయుటకును, తీర్మానించటమైనది.

ఈసంస్థకు డాక్టర్ రాజేంద్రప్రసాద్‌గారు అధ్యక్షులుగను, యల్. యమ్. శ్రీకాంత్, వెన్నెలకంటి రాఘవయ్యగారు కార్యదర్శులుగను, డా॥ మోహన్‌సింగ్ మెహతాగారు కోశాధికారిగను, మరి తొమ్మండుగురు కార్యవర్గ సభ్యులును ఎన్నుకొనబడిరి.

శ్రీ ఎ. వి. ఠక్కరుబాపాగారు తొలి సమావేశంలో స్వాగతోపన్యాసమిస్తూ సమావేశానికి హాజరైన వర్కర్లంతా తమ తమ స్వస్థలాలను చేరుకొన్నపిదప యినుమడించిన ఉత్సాహం, రెట్టింపు పట్టుదలతో పనిచేయవలసి ఉన్నదని హెచ్చరించిరి. సమావేశానికి హాజరైన వర్కర్లు చాలామంది ఆయా ఆదిమజాతుల్లో తాము చేస్తున్న కృషిని గూర్చిన రిపోర్టులను చదివిరి. అధ్యక్షులు రాజేంద్రప్రసాద్‌గారు రిపోర్టు లన్నింటిని సావధానంగా విన్నపిదప ఆదిమవాసుల అభివృద్ధికై జరుగుతున్న కృషిని ప్రశంసిస్తూ, ఈ జాతుల సర్వతోభివృద్ధికి డబ్బుకొదవనిన్నీ, ధనం విషయంలో లోటులేదనిన్నీ, పట్టుదల, చిత్తశుద్ధితో పనిచేయగల ఎక్కువమంది వర్కర్లు కావలసి ఉన్నారనిన్నీ, గాంధీజీ స్మారకనిధినుండి ఈసంస్థకు ధనసహాయం లభించేటట్లు ప్రయత్నిస్తాననిన్నీ, హిందూ సమాజం అనాదినుండి ఆదిమవాసులపైనే ఆధారపడివుందనిన్నీ, పైవర్ణాలవారు, ఈ ప్రజల్ని మొదటినుండీ నిర్లక్ష్యంగా చూస్తూండటంవల్లనే యీ ప్రజలు యిట్టి స్థితికి వచ్చారనిన్నీ, వర్కర్లంతా చిత్తశుద్ధితో కృషిచేసినట్లయితే త్వరలోనే యీ జాతులన్నీ అభివృద్ధికి రాగలవనిన్నీ, ఉద్బోధించిరి.

# ఆంధ్రదేశ పెద్దల విద్యాబోధకసంఘం స్థాపన

వేటపాలెం, నవంబర్ 2: ఆంధ్రదేశంలో వయోజన విద్యావ్యాప్తి కావించు నిమిత్తం రాష్ట్రప్రభుత్వంవారిచే తయారు చేయబడిన ప్రణాళిక ననుసరించి యిప్పటికి వేటపాలెం, మహానందులలో 98 మందికి శిక్షణ యివ్వబడినది. ఈ బోధకులు ముందు వయోజన విద్యా కేంద్రాలు నడుపు సందర్భంలో కలుగు సమస్యలను పరిష్కరించుటకును, పెద్దల విద్యా ప్రచారం విరివిగా సాగించుటకును ఒక సంఘం ఉండట అవసరమని భావించి, అక్టో 31 వేటపాలెంలోనున్న వయోజన విద్యాబోధకులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను సమావేశమై ఆంధ్రదేశ పెద్దల విద్యాబోధక సంఘమును స్థాపించిరి. దానికి అధ్యక్షులుగా నర్రావుల వెంకట సుబ్బారావుగారు ఎన్నుకొనబడిరి. అని సంఘ సమావేశకర్త బండి నాగేశ్వరరావుగారు వ్రాసిరి.

### పల్నాడు తాలూకా కాంగ్రెస్ ఎన్నికలు

నరసరావుపేట, నవంబర్ 1: పల్నాడుతాలూకా కాంగ్రెసు సంఘమునకు శ్రీ ఆదినారాయణరావు, కార్యదర్శిగా పుల్లారెడ్డిగారు ఎన్నుకొనబడిరి.

అక్టో 31 న ప్రొద్దుటూరు పౌరజనులు వి. కొండారెడ్డిగారి అధ్యక్షతను సమావేశమై కంట్రోల్సు, రేషనింగును తిరిగి ప్రవేశపెట్టవద్దని ప్రభుత్వమును కోరుచూ ఒక తీర్మానం చేసిరి.

# "యుద్ధరంగంలో కూడా ఆంధ్రులఖ్యాతి మిన్నుముట్టాలి"

## కాశ్మీరులోని మద్రాసుసైనికులకు గోపాలరెడ్డి హెచ్చరిక

శ్రీనగరు, నవంబరు 2: కాశ్మీరులో యుద్ధముచేయుచున్న మద్రాసు సైనికుల స్థితిగతులు కనుగొనుటకిచ్చటికి వచ్చియున్న మద్రాసు అర్థికమంత్రి, గోపాలరెడ్డిగారు సైనికులఎదుట తెలుగులో ఉపన్యసించుచు "దక్షిణ దేశమునుండి ఇంతదూరము వచ్చి, ఈ క్రొత్త వాతావరణములో, క్రొత్త మనుషులతో కలసి, క్రొత్తరకము ఆహారము పుచ్చుకొనుచు ధైర్యసాహసములతో పోరుట ప్రశంసనీయమైన విషయము. రాజకీయరంగములో మద్రాసురాష్ట్రము గొప్ప సేవ చేసియున్నది. కాని అది చాలదు. యుద్ధరంగములో మీరు తెచ్చుకొన్నకీర్తి దక్షిణదేశాని పెంచుకొనుటకు యత్నించవలెను." అని చెప్పెను.

### యుద్ధం నించి తిరిగివచ్చిన సైనికుల సహాయనిధి

చెన్నపట్నం, నవంబరు 3: యుద్ధం నుంచి తిరిగివచ్చిన సిపాయిల నిమిత్తం స్థాపించబడిన సహాయనిధి సంఘం నేడుదయం సెంట్ జార్జి కోటలో గవర్నరు భావనగర్ మహారాజ్‌గారి అధ్యక్షతక్రింద సమావేశమైంది.

### చెరకు పంటదారుల సభ

మదరాసు గోఖలే హాలులో ద. ఇ. చెరకు పంటదారుల సభ శుక్రవారం నవంబరు 5 తేదీ ఉదయం 9 గ. జరుగును. డా॥ నాగన్న గౌడగారు అధ్యక్షత వహింతురు. టి. ఎస్. వెంకట్రామయ్యగారు సభా ప్రారంభోపన్యాసం జరిపెదరు.

### 'వారా' గారికి సన్మానం

శ్రీ వా. రామస్వామయ్యంగారు, వా. రా. అను పేరుతో తమిళకవచన గ్రంథములనేకం వ్రాసి, తమిళ సాహిత్యానికి సంఘానికి తోడ్పడిన కవిగారికి వారి షష్టిపూర్తి సందర్భమున సన్మాన సంఘం వారు రాజాజీహాలులో కామరాజనాడారుగారి అధ్యక్షతను సభచేసి రు 18351 కానుకగా నిచ్చిరి.

### అదనపు పోలీసు

కడప జిల్లాలో ముసలిరెడ్డిపల్లి గ్రామమునందుంచబడిన అదనపు పోలీసు దళము యింకో ఆరునెలలుండునట్లు ప్రభుత్వంవారు ఉత్తరువు చేసిరి.

### బ్యాంకులో 6201 గోల్మాలు

కృష్ణస్వామయ్యరు, చీఫ్ ఇంజనీరు ఆఫీసు సూపర్నెంటు 2 వ తేది ఉదయం రిజర్వుబ్యాంకులో చెక్కుమార్చి రూ. 6201 తీసుకొనుచుండగ, ఒక రూపాయి నోటు క్రింద పడిపోతే వంగి తీయగా, కిటికీ దగ్గర నుంచిన మిగిలిన నోట్లకట్ట అంతా పోయిందని పోలీసులకు ఫిర్యాదుచేసెను.

### గ్రహణ స్నాన మరణం

మదరాసు, నవంబరు 2: నిన్న గ్రహణం సందర్భమున సముద్రస్నానానికి పోయిన ఒక 30 సం॥ వ్యక్తి శవము ఒడ్డునకు కొట్టుకొనివచ్చెను. ఎవరయినది నేడు గూడ గుర్తింపబడలేదు.

### ఆత్మహత్య

కోదండరామయ్య, అమ్మాళ్ అను 18 సం॥ల యువతి చాకలిపేటలో నిన్న రాత్రి కిరసనాయిలు పోసుకొని కాలి చనిపోయెను.

# సభలు - సమావేశాలు

ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ మహాసభలు నవంబరు 14,15,16 తేదీలలో విజయవాడలో జరుగును.

ఆంధ్రరాష్ట్ర చెరకు ఉత్పత్తిదార్ల మహాసభ యీనెల 12 న అనకాపల్లిలో గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారి అధ్యక్షతను జరుగును.

ఆంధ్ర నాటక కళాపరిషత్తు కార్యవర్గసమావేశము యీనెల 14 న ఏలూరు శ్రీ రాణీ పాపయ్యమ్మ రావుబహద్దరువారి ధర్మశాలలో జరుగును.

ఏలూరుతాలూకా కాంగ్రెస్ సర్వసభ్యసమావేశం యీనెల 10 న పోతునూరు గ్రామంలో జరుగును.

దక్షిణ విశాఖజిల్లాకాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమ సేవకుల సభ యీనెల 8 న విశాఖపట్నంలో జరుగుననీ, చెన్నరాష్ట్ర మంత్రి శ్రీ సుబ్బరామరెడ్డిగారు ఉపన్యసించెదరనీ జిల్లాకాంగ్రెస్ అధ్యక్షులు వ్రాసిరి.

ఏలూరుతాలూకా సైనికకాంగ్రెస్‌సభ యీనెల 5 నుండి వాయిదా వేయబడినదనీ, ఎప్పుడు జరుగునదీ తేదీ వివరాలు తెలియజేయబడుననీ కొమ్మారెడ్డి సత్యనారాయణ వరప్రసాదరావుగారు వ్రాసిరి.

# బ్రిటనుకు జనపనార ఎగుమతి

## బ్రిటిష్ ఆరోపణలు నిజము కావని వాణిజ్యశాఖ ప్రతినిధి

న్యూఢిల్లీ, నవంబరు 2: భారతదేశము తన జనపనార నిల్వలను అట్టిపెట్టుకొనుచున్నదని, తగినంతగా విడుదల చేయుట లేదని కొంతకాలముండి బ్రిటిష్ జనపనార పరిశ్రామికులు గావించిన ఆరోపణలు నిజము కావని ఇండియా ప్రభుత్వ వాణిజ్యశాఖ ప్రతినిధి యొకరు నేడు చెప్పెను.

భారతదేశము నందలి జనపనార నిల్వల విషయమై ఆయన ఈ క్రింది విషయములు తెలియజేసెను:—

జనపనార వ్యాపారమును పాకిస్థాను గుత్తకొనియున్నది. పాకిస్థానులో 65 లక్షల బేళ్ల జనపనార ప్రతి సంవత్సరము పండును. దీనిలో వారు భారతదేశమునకు 50 లక్షల బేళ్లు ప్రత్యేకించిరి. భారత జనపనార మిల్లులకు కావలసినదాని కంటె యిది తక్కువే. భారత మిల్లులకు 60 లక్షల బేళ్ళు కావలసియున్నవి. దీనిలో 10 లక్షల బేళ్లు దేశములో పండును. ఇప్పుడు రెండుమాసములకు సరిపోవు జనపనారమాత్రము భారతదేశములో నున్నది. బ్రిటనులో ఆరుమాసములకు కావలసిన జనపనారయున్నదని తెలియుచున్నది. కనుక ప్రస్తుత సమయమున భారతదేశము నుండి బ్రిటనుకు జనపనార ఎగుమతిచేయ వీలులేదు. ఇదప్పటికి బ్రిటన్ ప్రత్యేక పరిస్థితిని, బ్రిటన్-ఇండియా సన్నిహిత వాణిజ్య సంబంధములను విచారించి బ్రిటనుకు ఈ సంవత్సరాంతమువరకు 2½ లక్షల బేళ్ళ జనపనారకోటా ప్రత్యేకింప గత జూలై మాసములో భారతదేశము నిర్ణయించెను. రాబోవు మూడుమాసములకు ప్రత్యేకింపు త్వరలో జరుగును. జూలైలో ఈ 2½ల. బేళ్ళ ప్రత్యేకింపు జరిగినతరువాత తమకు అత్యవసరముగా జనపనార కావలెనని బ్రిటిష్‌బోర్డువారు ప్రార్థించగా 50 వేల బేళ్ళు విడుదల చేయవలసినదిగా ఉత్తరువులు జారీయయ్యెను. ఈ జనపనార యిప్పుడు నావలలో పంపబడుచున్నది. తక్కిన 2 లక్షల బేళ్ళ ప్రత్యేకింపు విషయము వాణిజ్యశాఖ విచారణలో నున్నది.

యంత్రములకు, ఉక్కు ఇనప సామగ్రికి మారుగా జనపనార పంపవలసినదని చాలా దేశములు కోరినట్లు ఆయన వెల్లడించెను. ప్రత్యేకింపవలసిన రెండులక్షల బేళ్ళలో కొంచెము జపాను, జర్మనీలకు పంపబడెనని ఆయన చెప్పెను. (అ. ప్రె.)

# ఐక్యరాజ్యసమితిలో ఫ్రాంకో స్పెయిన్‌కు స్థానం

పారిస్, నవంబర్ 3: ఫ్రాంకో స్పెయినుకు, ఒక పరిమిత విధానములో, ఐక్యరాజ్య సమితియందు స్థానము కల్పింపబడుచున్నది. అరికవి భాగముల యందు స్పెయిను కూడ 1928 ఒడంబడిక క్రిందికి తేబడవలెనని చేయబడిన ప్రతిపాదన నంగీకరించుచూ నోటుచేసిన అధిక సంఖ్యాకవర్గములో బ్రిటనుకూడ నున్నది.

### వివాహము

కేపల్లె, అక్టోబరు 31: సాహితీసమితి కార్యదర్శి శ్రీ సోరి నరసింహశాస్త్రిగారి ద్వితీయపుత్రిక చి॥ సౌ॥ సుబ్బ పరమేశ్వరికి, శ్రీ చావలి లక్ష్మీనారాయణ శాస్త్రిగారికి యీనెల 21 న రేపల్లెలో వైభవంగా వివాహము జరిగెను. జగద్గురు శ్రీ కళ్యాణానంద భారతీ మహంతాచార్య స్వామి, స్వామి శివశంకరశాస్త్రి, మాధవరాయశర్మ, పిల్లలమర్రి హనుమంతరావు మొదలగు ప్రముఖులు వివాహమునకు హాజరై వధూవరుల నాశీర్వదించిరి.

గుంటూరు రాయలసీమ సంఘమునకు అధ్యక్షులుగా డా॥ రామదాసు, కార్యదర్శిగా పి. హనుమంతరావుగారు ఎన్నుకొనబడిరి.

సాలూరుతాలూకా మన్యవ ఫిర్కా రైతు సభ కె. హరికృష్ణ చౌదరిగారి అధ్యక్షతను జరిగెను. అధ్యక్షులు జమీందారీ రద్దుబిల్లు, అన్యాక్రాంతపు నిషేధచట్టము, శిస్తు తగ్గింపు చట్టములను గురించి ప్రసంగించిరి.

విజయవాడ శ్రీ వెంకటేశ్వర ఆయుర్వేద కళాశాలలో ధన్వంతరి జయంతి అక్టోబరు 30 న జరుపబడెను. డా॥ ఆచంట లక్ష్మీపతి, జటావల్లభుల పురుషోత్తం పండితకోటి రామశాస్త్రి, ముక్కామల వెంకటశాస్త్రిగార్లు ఆయుర్వేద ప్రాశస్త్యమును గురించి ప్రసంగించిరి.

సోషలిస్టుపార్టీ ఆధ్వర్యమున అక్టోబరు 29 న కనగాలలో అవుతు సుబ్బారెడ్డి అధ్యక్షతను బహిరంగసభజరిగెను. మద్దూరి అన్నపూర్ణయ్యగారు ప్రస్తుత రాజకీయ పరిస్థితులను గురించి ప్రసంగించిరి.

చిట్టిగూడూరు శ్రీ నారసింహ సంస్కృత కళాశాలా ప్రాచ్య విద్యార్థి పరిషత్ ద్వితీయ మహాసభ అక్టోబరు 27 న వేదాంతం రామకృష్ణాచార్యులుగారి అధ్యక్షతను జరిగెను. దేశంలో సంస్కృతి శ్లాఘావశ్యకతను గురించి పలువురు ప్రసంగించిరి.

# అనంతపురం జిల్లా విద్యార్థి కాంగ్రెస్ మహాసభ

హిందూపురం, అక్టోబరు 31: అనంతపురం విద్యార్థి కాంగ్రెస్ మహాసభ నిన్న సాయంకాలం మడకసిరా పట్నంలో అరవిందబోసుగారి అధ్యక్షతను జరిగెను. వి. ఎల్. సుందరరావుగారు ప్రారంభించుచు దేశస్వాతంత్ర్య సమరంలో విద్యార్థులు నిర్వహించిన పాత్రను వివరించిరి. విద్యార్థి కాంగ్రెస్‌లో క్రమంగా వచ్చిన మార్పును, భేదాలను తెలియజేసిరి. విద్యార్థులు అధినివేశ ప్రతిపత్తికి కాక సంపూర్ణ స్వాతంత్ర్యానికే పాటుబడవలెననియు, పరిపాలనాధికారం ప్రజల హస్తగతమగు వరకు విద్యార్థులు పోరాటం సల్పవలెననియు హెచ్చరించిరి. సామాన్య ప్రజానీకానికి, వారి నిత్యజీవితావసరములను తీర్చుటలో యువకులు, విద్యార్థులు కలసి ఒకపథకము ననుసరించిపనిచేయవలెనని జి. వెంకటరెడ్డిగారనిరి. రాష్ట్రవిద్యార్థి కాంగ్రెస్ కార్యదర్శి శ్రీనివాసరెడ్డిగారు ప్రసంగించుచు స్వాతంత్ర్యం వచ్చినప్పటికీ సామాన్య ప్రజానీకం ఆహారం, వస్త్రము లేక దుర్భరయాతన లనుభవించుచున్నారనియు, కాంగ్రెస్ సిద్ధాంతములు ప్రజాహితైకమయినప్పటికీ అందలి వ్యక్తులు ప్రజలకు వ్యతిరేకంగా ప్రవర్తించుచున్నారనియు, కాంగ్రెస్‌లోని కుళ్లును కడిగివేయుటకు విద్యార్థులు పూనుకొనవలెననియు చెప్పిరి. శేషగిరిరావుగారు మాట్లాడుచు, అనేక త్యాగాల ఫలితంగా వచ్చిన స్వాతంత్ర్యమును మనం నిలబెట్టుకోవలెననియు, విద్యార్థులు పల్లెప్రాంతాలలో ప్రచారంచేసి నిరక్షరాస్యతను రూపుమాపవలెననియు ఉద్బోధించిరి.

అధ్యక్షులు ప్రసంగించుచు ఆంగ్లభాష యింకను కొంతకాలంవరకు మనదేశంలో నుండవలెనని చెప్పిరి. "ఈలోగా దేశములోని ప్రజలందరు హిందూస్థానీ భాష నేర్చుకొనవలెను. దేశం స్వతంత్రమైనప్పటికీ, అధికారంలో ప్రజానాయకులే ఉన్నప్పటికీ, ప్రజాప్రభుత్వం ప్రజల అభివృద్ధినిగురించి శ్రద్ధవహించుటలేదు. ధనికవర్గములే యిప్పుడు అధికారంలోనున్నవి. లోగడ మాదిరిగానే యిప్పుడుకూడ పేదలు అధోగతిలో నున్నారు. అధికార్లలో లంచగొండితనం, అవినీతి పెరిగిపోవుచున్నది. కాబట్టి యీ పరిస్థితిని తొలగించుటకు విద్యార్థులే పాటుపడవలసియున్నది." అని బోసుగారు చెప్పిరి. కార్యదర్శి రాజయ్య వందనాలతో సభ ముగిసెను.

# హోమియోపతీ వైద్యవ్యాప్తి

## విచారణసంఘ ప్రశ్నావళి

న్యూఢిల్లీ, నవంబర్ 2: హోమియోపతి వైద్యబోధనకై ప్రస్తుతం దేశంలోఉన్న సౌకర్యాలను పరిశీలించి, సక్రమబోధనకై తీసుకోవలసిన చర్యలనుగురించీ, హోమియోపతి వైద్యముపై ప్రభుత్వ అజమాయిషీ అవసరమైతే ఏవిధంగా దానిని చేయవలెను అన్న అంశంమీదనూ సూచనల నిచ్చుటకై ప్రభుత్వం ఆగస్టులో ఒక విచారణ సంఘాన్ని నియమించియున్నది. ఈసంఘం దేశంలోగల ప్రముఖ హోమియోపతి వైద్యులకు, సంఘాలకూ ఒక ప్రశ్నావళిని పంపినట్లు తెలుస్తున్నది.

ఈ సంఘం పరిస్థితులను పరిశీలించుటకై లక్నో, కలకత్తా, నాగపూర్, బొంబాయి, చెన్నపట్నములకువచ్చి ఆ ప్రాంత ప్రతినిధుల వాదములను వినగలరు. ఆ సంఘం ఈ కింది తేదీలలో ఈ పట్టణాలను దర్శించగలరు.

డిశంబర్ 1 నుండి 3 వరకు ఢిల్లీ; 5 నుండి 7 వరకు లక్నో; 17 నుండి 21 వరకు కలకత్తా; జనవరి మధ్యభాగంలో నాగపూర్, జనవరి ఆఖరుకు బొంబాయి, ఫిబ్రవరి మధ్యభాగంలో చెన్నపట్నం.

# ముస్లిము దేశములు ఏకము కావలెను

## లియాకతాలీ ఉద్బోధ

కయిరో, నవంబరు 3: పారిస్‌నుండి నేడు యిచ్చటికి విమానములో వచ్చిన పాకిస్థాను ప్రధాని లియాకతాలీఖాను ముస్లిమ్ సంవత్సరాది సందర్భమున సందేశమొసంగుచు ముస్లిమ్ దేశములన్నియు ఏకము కావలెనని కోరెను.

నూతన సంవత్సరములో ప్రపంచము నందలి ముస్లిములు స్వాతంత్ర్యములు పొందుటయేగాక యింక, వారు పడుచున్న కష్టములు, ముఖ్యముగా అప్పులు పడుచున్న కష్టములు అంతమొందుగాక యని ఆయన కోరెను. ప్రస్తుత సమయమున ముస్లిములు, ముఖ్యముగా ఆసియా దేశములు ఏకమగుట అత్యవసరమని, ఐకమత్యమువల్ల బలము, పృథక్కారణమువల్ల పతనము కలుగునని ఆయన చెప్పెను.

## షోబుల్లాఖాన్ హత్యా అభియోగం

### మరొక అప్రూవరు వాఙ్మూలం

హైదరాబాద్, నవంబర్ 3: ఇమ్రోజ్ పత్రికా సంపాదకుడు షోబుల్లా ఖాన్ ను హత్యచేయుటకు కాశింరజ్వీ తన సెట్లు ప్రోద్బలపరచినదీ వివరించుచు, ఈ హత్యాభియోగం సందర్భములో మరొక అప్రూవర్ అయిన కాదిర్ మొహియుద్దీన్ అసీర్ నిన్న నగరపు 5 వ మేజస్ట్రేటు వద్ద ఒక వాఙ్మూలము ఇచ్చెను. అందలి ముఖ్యాంశములివి. కాదిర్ మొహియుద్దీన్ ఏవార్డు జిల్లామజ్లిస్ అధ్యక్షుడు. కాచిగుడా, చప్పల్ బజార్ బర్కత్ పురా, హిమాయత్ నగర్, నారాయణగుడా ఇతని అజమాయిషీ కింద ఉండేవి. ఇమ్రోజ్ సంపాదకుడు షోబుల్లాఖాను, ఇతడు బర్కత్ పురాలోనే నివసించేవాడు. ఏడెనిమిది నెలలక్రితం ఒక రోజున ఇతడు ఇత్తెహాదుల్ ముస్లిమీన్ అధ్యక్షుడు కాశిం రజ్వీని కలుసుకొనుటకు తటస్థించెను. అప్పటి సంభాషణలో రజ్వీ ఇతనితో, 'భాయూ, పనికివచ్చేవాడొక్కడైనా లేడోయ్' అనెను. మజ్లిస్ అధ్యక్షులైన మీకే, పనికివచ్చేవాడొక్కడైనా కనిపించకపోవడం విచిత్రం' అని ఇతడనెను. రజ్వీ ఒక నిట్టూర్పువిడచి, ఆ ప్రసక్తిమార్చెను. కొంతకాలముతర్వాత ఒకరోజున మొహియుద్దీన్ దారుస్సలాంలో రజ్వీతో ఏకాంతముగ ఉండుట తటస్థించెను. రజ్వీ, ప్రసంగవశమున తాను కొంతకాలంక్రిందట అన్న 'మాట' అర్థం బోధపడిందాఅని ఇతనిని అడిగెను. ఇతను ఆమాటకు ఆశ్చర్యపడి, తనకేమీ జ్ఞాపకము లేదని, వివరములు తెలుపవలెనని కోరెను. అప్పుడు రజ్వీ ఇతనిని, 'షోబుల్లాఖాన్ ను ఎరుగుదువా?' అని అడిగెను. 'ఎరుగుదు' నని ఇతననగా, 'అతడెక్కడ ఉంటా' డని రజ్వీ అడిగెను. తానూ, షోబుల్లా ఒక ప్రాంతంలోనే ఉంటున్నట్లు ఇతడు చెప్పెను. రజ్వీ, షోబుల్లాను గురించి చెబుతూ, అతడు తన పత్రికను ముస్లిములకు, ముఖ్యంగా ముస్లిమీన్ సంస్థ విధానానికి ప్రతికూలముగ ఉపయోగించుచుండెనని, తనను గురించి వ్యాసములు, వ్యంగ్యచిత్రములు ప్రచురించుచుండెనని కనుక అతనిని కడతేర్చవలెనని, మొహియుద్దీన్ ఆ ప్రాంతంలోనే ఉంటున్నందు వల్ల ఆ బాధ్యతను అతడు వహించవలెనని అనెను. మొహియుద్దీన్ మొదట అందుకు సిద్ధపడలేదు. కాని, రజ్వీ దరిమిలా సుమ్మీ ఇతనిని కలిసికొని, ఈపని ఇతను స్వయంగా చేయనక్కరలేదని, కాని ఆ ప్రాంతములోని ఏ గూండాచేతనైన చేయించవలెనని గట్టిగ చెప్పెను.

కొంతకాలము పిమ్మట హైదరాబాదు భారతసమాఖ్యలో చేరువిషయమై నవాబ్ మంజూర్ జా మరి ఆరుగురు చేసిన ప్రకటన వెలువడెను. ఆతర్వాత ఒకరోజు రాత్రి 10 గంటల ప్రాంతమున రజ్వీ ఇతనిని మాలకపేటలోని తనయింటికి పిలిపించెను. అప్పుడు ఏకాంతముగ జరిగిన సంభాషణలో, రజ్వీ, హైదరాబాద్ స్థితిగతులు వివరించి, పరిస్థితి అతివేగముగ మారుచున్నదని, తామందరు ఇప్పుడు చావు బ్రతుకుల పోరాటంలో పడిరని, హైదరాబాద్ స్వాతంత్ర్య పోరాటము ఉజ్వలంగా జరుగుచున్నప్పుడు తమలో ద్రోహులను సహించరాదు" అనెను. అతను చెప్పినదంతయు వాస్తవమేనని ఇతడనెను. అంతలో రజ్వీ కటువుగ 'షోబుల్లాను చంపివేయాలి' అనెను. ఇటువంటి పరిస్థితులలో ఒక నిశ్చయానికి రావడంలో ఏర్పడుటయింపు ప్రమాద హేతువనికూడ అతను చెప్పెను. అప్పుడు ఇతను (అప్రూవారు) తాను పెద్దకుటుంబమును పోషింపవలసివున్నదని, ఆబాధ్యతను ఎవరు వహించెదరని అడుగగా, అభయం యేమీ అక్కరలేదని, అప్పటి ప్రభుత్వం తమదేనని, యితనికి వచ్చే ప్రమాదం ఏమీలేదని రజ్వీ అనెను. పిమ్మట అతడు తన అలమరనుంచి 12 గుండ్ల రివాల్వరు ఒకటి తీసి యితనికి ఇచ్చెను.

ఆపిమ్మట మొహియుద్దీన్, సాహసులైన రజాకార్ల కొరకు ప్రయత్నించి, 3 రోజుల తర్వాత అబ్దుల్ మునీం ఖాన్ ను (మొదటి అప్రూవర్) మరిద్దరిని గురించి తెలుసుకొనెను. ఆతర్వాత మరి 3 రోజులకు మునీంఖాన్ ముస్లిమీన్ పనిమీద యితనికద్దకు వచ్చెను. అప్పుడితడు అతనిలో నమ్మకముంచి, ప్రమాణం చేయించి రజ్వీ 'ఆజ్ఞను' అతనికి తెలియచేసెను. మునీంఖాన్ షోబుల్లాను చంపుటకు వెంటనే అంగీకరించి, చాల రోజులనుంచి తాము ఆ ఉద్దేశముతోనే ఉండెనని, (రజ్వీ) అంతటివ్యక్తి అండగావుంటే తమపని సులభంగా జరుగునని అనెను. మరి 3 రోజులతర్వాత అతడు యితనివద్దకువచ్చి, ఆయుధాలు కావాలనెను. అమర్నాటి సాయంత్రమే మురల మోహసిన్ రజా అనే రజాకార్ తో అతడు రాగా యితను తనకు రజ్వీయిచ్చిన రివాల్వర్ ను వానికిచ్చి, దానిని ఉపయోగించువిధము తెలిపెను. అప్పుడు రజాచేతిలో కత్తి ఒకటి ఉండెను. రాత్రి 8 గం ప్రాంతమున వాళ్ళిద్దరు వెళ్ళి, కాని 12 గం॥తిరిగివచ్చి, షోబుల్లా ఆరోజున పత్రికా కార్యాలయమునకు రాలేదని చెప్పిరి. మరుసటి రోజు రాత్రి 8 గం మళ్లీ ఇద్దరూ వచ్చి రివాల్వర్ తీసికొని వెళ్ళిరి. ఆరోజుకూడ పదకొండు పన్నెండు గంటల మధ్య తిరిగివచ్చి, 'ఇమ్రోజ్' కార్యాలయం మూసివున్నదని చెప్పిరి. (ఆగష్టు) 21-వ తేదీరాత్రి 2 గంటలప్పుడు వారిద్దరూ, మరొక కొత్త కుర్రవాడువచ్చి ఇతనిని లేపిరి. ఇతడు తలుపులుతీసి చూచుటతోడనే కొత్తవాని బట్టలు నెత్తురు మరకలతో కనపడెను. షోబుల్లాను చంపివేశామని, ఈ అబ్బాయి తీవ్రంగా గాయపడ్డాడని, తమకు ఇచ్చట ఆశ్రయమివ్వవలెనని మునీంఖాన్ ఇతనితో చెప్పెను. మోహసిన్ రజా, కొత్త కుర్రవాడూ షోబుల్లాతో మాట్లాడుచుండగా, తాను వెనుకనుండి రివాల్వర్ తో కాల్చెనని, షోబుల్లా పడిపోయినను, తన కాల్పుపట్టుకు లాగెనని, దానిపైన తాను మరి రెండుసార్లు రివాల్వరు పేల్చివా గురితప్పెనని, ఈలోగా కొత్తకుర్రవాడు రజావద్దనున్న కత్తి తీసికొని షోబుల్లాను, అతనితో ఉన్నవానిని పొడిచెనని, ఆవిధంగా తనను షోబుల్లా పట్టునుండి విడిపించెనని కూడ మునీంఖాన్ ఇతనికి (మొహియుద్దీన్) వివరించెను. అంతా విన్నతర్వాత మొహియుద్దీన్ వాళ్ళకు ఆశ్రయమివ్వ నిరాకరించెను. వాళ్ళు ముగ్గురు వెళ్ళిపోయిన తర్వాత ఇతను రజ్వీ ఇంటికిపోయి, అతడు నిద్రపోవుచున్నందున, షోబుల్లాఖాన్ ను చంపివేయడమయినదని కాగితంమీద వ్రాసి అచ్చటపెట్టి, రివాల్వరుకూడ అచ్చటనేఉంచి, తెల్లవారకట్ల 4-30 ప్రాంతమునఇంటికితిరిగివచ్చెను. తెల్లవారుటతోడనే, అనగా 22 వ తేదీ ఉదయం మళ్ళీ ఇతను రజ్వీ ఇంటికి వెళ్ళి షోబుల్లా హత్య వివరములు తెలియచేసెను. రజ్వీ ఇతనిని తనఇంట ఉండమని, ఏమీ భయంగారుపడవద్దని చెప్పెను. తర్వాత ఈ సందర్భమున కొందరు అరెస్టుకాగా, ఇతను రజ్వీతో చెప్పెను. రజ్వీ వాళ్ళను తానువిడిపించెదనని చెప్పి, ఇతనిని ఆ ప్రాంతములోని ముస్లిములందరు శాంతముగ ఉండవలెనని ప్రబోధించుటకు నియమించెను. సెప్టెంబరు 14 వ తేదీన మొహియుద్దీన్ రజ్వీ ఫోటో ఒకటి తీసికొని దానిపై అతని చేవ్రాలు చేయించుకొనబోయెను. చేవ్రాలు చేయుచు రజ్వీ 'ఎక్ మహాన్ బాచీకో' అని వ్రాసెను. భారతసేనలు హైదరాబాదులో ప్రవేశించుట తోడనే ఇతడు ఆ ఫోటోను తగులబెట్టెను.

## విజయవాడలో 5 గంటలలో దాదాపు 11 దుక్కుల కుంభవర్షం

### బుడమేరు వరదలవల్ల ఏలూరురోడ్డుపై రాకపోకల ఆపుదల

(స్వకీయ విలేఖరి)

విజయవాడ, నవంబరు 4: ఈ రోజు తెల్లవారుఝామున 3 గంటల నుండి ఉదయం 8 గంటల వరకు ఇచ్చట కుంభవర్షం కురిసెను. 4.18 అంగుళా (దాదాపు 11దుక్కులు) వర్షం పడెను. ఇరవై ఏండ్ల ఈ మధ్య ఇంత వర్షం ఎన్నడూ కురవలేదు.

నగరంలోని పల్లపు ప్రాంతము లన్నియు జలమయమై పోయినవి. తాలూకాఫీసు, టెలిఫోను, టెలిగ్రాఫ్ ఆఫీసులచుట్టూ మోకాలులోతు నీరు నిలచినది. ఆఫీసులలోకి మాత్రము పోలేదు.

బుడమేరు వరదలు వచ్చినవి. గ్రేట్ నార్తరన్ ట్రంకురోడ్డుపైన రెండడుగుల నీరు పారుచున్నది. వరద నీటిమట్టం ఇంకా హెచ్చు సూచనలున్నవని పబ్లిక్ వర్క్సు శాఖ ఉద్యోగులనిరి.

విజయవాడ—ఏలూరు రస్తాపై రాకపోకలాగిపోయినవి. విజయవాడ, మచిలీపట్నం రైలుమార్గంలోని నిడమానూరు, తరిగొప్పుల స్టేషన్లమధ్య బుడమేరు వరదనీరు రైలుపట్టాలను తాకుచున్నది. మార్గమును కాపాడుటకు రైల్వే ఉద్యోగులు జాగ్రత్త వహించుచున్నారు. వరి, వేరుశనగ పంటలకు చాల నష్టము కలుగుతుందని భయపడుచున్నారు. వాతావరణం తుపాను సూచనముగా నున్నప్పటికీ గాలితెరలు వువవుడిగా లేకుండుట ఒక సుగుణంగా ఉన్నది.

### మంగళగిరి

నవంబరు 3: యిచ్చట మొన్నటి నుంచి గాలి, వాన కసరుతో వానపడుచూ పోతూవున్నది. రాత్రి గాలితో వాన ప్రారంభించినది. యిప్పటికి ఆకాశమంతా మేఘములతో వుండి వాన అప్పుడప్పుడు పడుచునే వున్నది.

కొన్ని మెట్టపంటలకు వరికి నష్టమని రైతులు అనుచున్నారు.

## స్వామీజీ నల్లగొండజిల్లా పర్యటన

హైదరాబాద్, నవంబరు 3: సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానంద తీర్థగారు నల్లగొండ జిల్లాలో పర్యటించనున్నారు. సర్దార్ జమలాపురం కేశవరావుగారితో కలసి తీర్థగారు యీనెల 8 న హైదరాబాద్ నుండి బయలుదేరి తిరిగి 10 వ తేదీకి వచ్చెదరు. సంస్థాన కాంగ్రెస్ నిజాం నవాబును తొలగించి అతని స్థానే బేరారు రాకుమారుని సంస్థానాధీశ్వరునిగా ఏర్పాటుచేయవలసిందని కోరినట్లుగా ప్రకటింపబడిన వార్తలు సత్యదూరమైనవని కాంగ్రెసువర్గములు ఖండించుచున్నవి. సంస్థాన కాంగ్రెస్ కార్యాచరణ సంఘంవారు నాగపూర్ లో గత సెప్టెంబరు 2 న చేసిన తీర్మానం నిజాం నవాబును తొలగించవలెననియేనని కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి జె. కె. ప్రాణేశాచార్యగారు చెప్పిరి. అక్టోబరు చివరివారంలో సమావేశమైన సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గం, కార్యాచరణ సంఘంవారి రాజకీయ దృక్పథమును, విధానమును అనెవాదించుటమాత్రమే చేసినదనికూడ ఆయన చెప్పెను.

## మద్రాసు ధాన్యపు కొట్లబిల్లు

రాష్ట్రములోని ధాన్యపు కొట్లను రక్షించుటకు, వాటికి లైసెన్సు లిచ్చుటకు, "మద్రాసు ధాన్యపుకొట్లబిల్లు 1948" ప్రభుత్వముచే ప్రకటింపబడినది.

వ్యవసాయకుడు కొట్టులో ధాన్యమును నిలవచేసికొని, ఈ కొట్ల అధికారి వద్దనుంచి రసీదును పొందును. ఈ రసీదుపై సహకారసంఘము నుంచి గాని, లేక బ్యాంకు నుంచి గాని అప్పును తీసికొనవచ్చును. ఈ సహకార సంఘములు, బ్యాంకులు, రిజర్వుబ్యాంకులో ఈ రసీదులనుంచి డబ్బును తెచ్చుకొనగలవు. ఇట్టి సదుపాయమువలన వ్యవసాయకునకు సకాలములో ధనము లభించుటయేగాక, కష్కుస్థిరలకు ఉత్పత్తిని అమ్ముకొనవ అవసరము ఉండదు.

ఈ బిల్లుద్వారా నిలవచేయదగు పదార్థములు: ధాన్యము, నూనెగింజలు, నారపదార్థములు, మందులు, బెల్లము పంచదార, పరిమళ ద్రవ్యములు, ఊరగాయలు, ఉర్లగడ్డలు. ఇవిగాక కాలానుకూలముగా, అవసరమునుబట్టి మరి కొన్ని పదార్థములను కూడా చేర్చవచ్చును.

ఇట్టి కొట్లను నిర్వహించువ్యక్తి (వేర్ హౌస్ మన్) లైసెన్సును పుచ్చుకొనియుండవలెను. కాని కొట్లను (గోడౌన్లను, నిర్వహింప బూనుకొనిన బ్యాంకులు, బ్యాంకర్లు, తమహామీతో పదార్థములను నిల్వచేయనిచ్చినవారు, లైసెన్సులను పొందనక్కరలేదు. కొట్లపై అప్పులనిచ్చు బ్యాంకులయొక్క బ్యాంకర్లయొక్క వ్యాపారమును మామాలుగా జరుగనిచ్చుటకై వీరికి ప్రత్యేకత చూపబడినది. వేర్ హౌస్ మన్ లైసెన్సు నుపొందువాడు, సరియైన కొట్లను కలిగియున్నాడా, ఆకొట్లను కాపాడు తాహతునుకూడా కలిగియున్నాడా అను విషయమై పరీక్ష జరుగును. ఈ లైసెన్సును రద్దుచేయుటకు ప్రభుత్వమున కధికారముండును. వేర్ హౌస్ మన్ నిలవచేసిన పదార్థములను వాన, ఎలుకలు, చెమ్మ మొదలైనవాటినుంచి కాపాడవలెను. నిలవచేయబడు పదార్థములలో ఒకదానివలన మరొకటి చెడిపోవునవి ఉండరాదు. నిలవదారుల పదార్థములను విడివిడిగా, అమాంతముగా వేరుచేయ వీలుగుటుగా ఉంచవలెను. ఏవైనను పదార్థములు చెడిపోవ ప్రారంభించినపుడు, వేర్ హౌస్ మన్ ఆసంగతిని నిలవదారునకు రిజిస్టర్ నోటీసుద్వారా తెలియజేయవలెను. అతడు వెంటనే తన పదార్థములను తీసికొనిపోకున్నచో, వాటిని ఏవిధంగానైనను వేలముచేయవచ్చును. వేర్ హౌస్ మన్ తన అధీనములోని నిలవ పదార్థములపైన ఇన్స్యూర్ (భీమా) చేయవలెను. పదార్థములను నిలవకై స్వీకరించుటలో వేర్ హౌస్ మన్ పక్షపాతమును చూపరాదు. సహకారసంస్థలకు మాత్రము ప్రత్యేకతను చూపమని ప్రభుత్వము కోరవచ్చును. నిలవయున్న పదార్థములపై వేర్ హౌస్ మన్ వ్యాపారమును చేయరాదు. కాని సహకారసంస్థలుమాత్రము ఈ విషయములో ప్రత్యేక హక్కులను కలిగియుండును. వేర్ హౌస్ మన్ తూనికలకు కొలతలకు తప్పనిసరిగా కలిగియుండవలెను.

ఈ బిల్లు నియమములను ఉల్లంఘించువారికి సంవత్సరము శిక్ష, జరిమానాకూడా విధింపబడును.

ఈ బిల్లు అమలుజరుగుటలో జనించు అభియోగములను విచారించుటకు ప్రత్యేక విచారణ సంఘములను ప్రభుత్వము నియమించును.

## రాజ్యాంగపరిషత్తు ఆఖరు సమావేశం

(1-వ పేజి తరువాయి)

నుగూడ మార్పుచేదగినవిగా నున్నవనియు ఆమె తెలిపెను. క్రొత్తగా ఐక్యమైన సంస్థానకూటముల ప్రతినిధులు యెన్నుకొనబడవలెనని ఆమె సూచించెను. హెచ్. వి. కామతుగారు చిన్న సవరణచేయగ, ప్రతిపాదకురాలు అంగీకరించిన పిదప ప్రతిపాదన అంగీకరించబడెను.

## అంబేడ్కర్ ప్రసంగం

ఢిల్లీ, నవంబరు 4: భారత భవిష్య రాజ్యాంగ విధానముయొక్క ముసాయిదాను తయారుచేసిన రాజ్యాంగ రచనా కమిటీ అధ్యక్షులగు డా॥ బి. ఆర్. అంబేడ్కరుగారు నేడు భారతరాజ్యాంగ పరిషత్తులో ఆ ముసాయిదాను ప్రతిపాదించుచు ఉపన్యసించిరి. ఈ రాజ్యాంగ రచనాకమిటి 1947 ఆగస్టు మాసములో రాజ్యాంగపరిషత్తు చేసిన తీర్మానానుసారము నియమింపబడెను. కేంద్ర ప్రభుత్వాధికారముల నిరూపించుట కొరకు కమిటీ రాష్ట్రీయ ప్రభుత్వాధికారముల నిరూపించుట కింకొకకమిటీ, కేంద్ర యూనియను రాజ్యాంగవిధాన నిరూపణకమిటీ మున్నగు కమిటీలు అప్పుడు రాజ్యాంగ పరిషత్తుచే నియమింపబడెను. ఈ కమిటీలు సమర్పించిన నివేదికలను పురస్కరించిన నివేదికలను పురస్కరించుకొని రాజ్యాంగ పరిషత్తు చేసిన నిర్ణయముల ననుసరించి భారతరాజ్యాంగ విధానమును తయారు చేయుటకై రాజ్యాంగరచనా కమిటీ నియమింపబడెను. ఈ కమిటీ తయారు చేసిన రాజ్యాంగ విధానపు ముసాయదాలో 315 నిబంధనలు కలవు. దీనికి అనుబంధముగా 8 షెడ్యూళ్లు కలవు. ఈ ముసాయిదా ప్రకటింపబడి ఎనిమిది మాసములైనది. దీనిని ప్రజాప్రముఖులందరును పరిశీలించి తమ అభిప్రాయములను నిరూపించుటకు తగినంత కాలవ్యవధి యివ్వబడెను.

ఈ రాజ్యాంగ విధానపు ముసాయిదాను పరిషత్తులో ప్రతిపాదించుచు అంబేడ్కరు గారిట్లు చెప్పిరి.

ఈ రాజ్యాంగవిధానము ఆచరణయోగ్యమైనది, దేశమునంతను ఏకముఖముగా కట్టుదిట్టము పరిపాలించుటకు శాంతికాలములోను యుద్ధకాలములోను ఈ రాజ్యాంగ విధానము సమర్థమైనది, ఈ రాజ్యాంగ విధానము ననుసరించుటవల్ల ఏ సందర్భములోనైనను పరిపాలనా వ్యవహారములు ఈ రాజ్యాంగముక్రింద చెడినయెడల, అలోపము ఈ రాజ్యాంగ విధానమువల్ల కానేరదు. మానవుడు వక్రముగా, వ్యవహరించువాడగుటవల్ల నేవ్యవహారములు కూడా వక్రించినవని చెప్పవలసియుండును.

ఇండియా ప్రెసిడెంటు అమెరికా ప్రెసిడెంటు వంటివాడు కాడు. ఇతరదేశాలలోని భిన్నరాష్ట్రాల సమాఖ్య ప్రభుత్వమువలె గాక భారతసమాఖ్య ప్రభుత్వము విస్తృతాధికారమును కలదై 91 వ్యవహార విషయములలో కేంద్రాధికారము వహించును. దేశమునంతను ఏకముఖంగా వ్యవహరింపజేయు నిమిత్తమై యీ రాజ్యాంగ విధానమందు మూడు ముఖ్య లక్షణములు కలవు. దేశమునకంతటికి ఒక్కపద్ధతిగా న్యాయవిచారణశాఖ ఏర్పరుపబడినది. సివిలు చట్టములలోను క్రిమినలు చట్టములలోను ప్రధాన ప్రాతిపదిక శాసనములు ఒక్కతీరుగానుండగలవు. దేశమంతటికి, ముఖ్యమైన ఉద్యోగపదవులకు ఇండియన్ సివిల్ సర్వీసు ఉద్యోగ వర్గమొకటె ఏర్పడి వ్యవహరించును.

### కేంద్ర ప్రభుత్వం

కేంద్ర ప్రభుత్వాధికారము బలిష్ఠమైనదిగా నుండవలెను. స్వదేశ సంస్థానములు కూడా రాష్ట్రములవలెనే యూనియన్ ప్రభుత్వములో లీనముకావలెను. అవినను గా సంస్థానములు లీనమైనయెడల, వాటికి ప్రత్యేక రాజ్యాంగ విధానములను నిర్ణయించవలసిన అగత్యములేదు. అట్టి ప్రత్యేకరాజ్యాంగ విధానముల నిర్ణయించుటకు ప్రత్యేక రాజ్యాంగ పరిషత్తులుకూడా అక్కరలేదు. రాష్ట్రాలవలెనే సంస్థానాలుకూడా చేరియున్నయెడల ఈ రెండింటికి, ఉండే భారతప్యమ వ్యత్యాసము అంతర్గామము కాగలదు.

అమెరికాలో ప్రెసిడెంటున్నూ కార్యదర్శులున్నూ అమెరికను పార్లమెంటులో సభ్యులుగా నుండరు. కాని ఇండియా ప్రెసిడెంటున్నూ ఇండియా ప్రభుత్వ మంత్రులున్నూ భారత పార్లమెంటులో సభ్యులైయుందురు. ప్రభుత్వమును నిర్వహించెడి కార్యవర్గము ప్రజాప్రతినిధి మండలికి నిత్యము జవాబుదారీ కలదైయుండవలెను. అంతేగాక, అట్టి కార్యవర్గము సులభంగా తొలగింపబడునట్టిదిగా నుండక సుస్థిరముగా ఉండి వ్యవహరింపగలదై యుండవలెను. ఈ రెండు లక్ష్యములను సమన్వయించవలసియున్నది. మన భారత రాజ్యాంగ విధానమును తయారుచేయు సందర్భములో ప్రభుత్వవర్గముయొక్క సుస్థిరతకంటే, ప్రజాప్రతినిధి మండలి యెడ వహించవలసిన బాధ్యతయున్నూ జవాబుదారీయున్నూ ఎక్కువ ప్రధానమైన అంశముగా భావింపబడెను. ఈ రాజ్యాంగ విధానములో నిర్ణయింపబడిన కేంద్ర ప్రభుత్వ పద్ధతి సమాఖ్య ప్రభుత్వ విధానమై యున్నది. ఏకాధిపత్య ప్రభుత్వ విధానము మాత్రము కాదు. ఏకాధిపత్య ప్రభుత్వ పద్ధతి క్రింద స్వతంత్రాధికార స్వపరిపాలిత రాష్ట్రములు ఉండవు. కాని సమాఖ్యక్రింద స్వతంత్రాధికార స్వపరిపాలిత రాష్ట్రములుండును. ఈ రాష్ట్ర సమాఖ్యపద్ధతి అమెరికా ప్రభుత్వపద్ధతిని పోలియుండును. సమాఖ్య యనగా కేవలము స్వపరిపాలితరాష్ట్రముల కూటముగాని సమితిగానికాదు. రాష్ట్రాలు అనేవి కేంద్రప్రభుత్వముయొక్క పరిపాలనాశాఖలుగానైనను ఉండవు. అమెరికా సంయుక్త రాష్ట్రములలో ప్రతిపౌరుడును ఆయా రాష్ట్ర ప్రభుత్వములో పౌర హక్కును పొందుటయేగాక కేంద్రప్రభుత్వపు పౌరహక్కునుకూడా ప్రత్యేకంగా పొందవలెను. ఇది ద్విముఖ పౌరసత్వము కాని భారత రాజ్యాంగము ప్రకారముగా, ఏ రాష్ట్రవాసియైనను భారతీయ పౌరుడుగానే పరిగణింపబడును. ప్రతి భారతీయుడును ఒక్కటేవిధమైన పౌర స్వత్వమును కలిగియుండును. రాష్ట్రీయపరిపాలనాధికారము కేంద్రప్రభుత్వ పరిపాలనాధికారము ఇవి రెండును వేర్వేరుగా నుండవచ్చును కాని, పౌరసత్వము యావద్భారత జాతికి ఒక్కటే విధముగా వర్తించును.

ఈ రాజ్యాంగ విధానము ప్రకారముగా భారత కేంద్ర ప్రభుత్వము సమాఖ్య పద్ధతిలో ప్రశాంత కాలమందు వ్యవహరింపగలదు కాని, యుద్ధకాలంలో యీ కేంద్ర ప్రభుత్వమే ఏకైకాధిపత్యపీఠముగా వర్తింపగలదు.

ఈ రాజ్యాంగ విధానములోని 275 నిబంధన ప్రకారముగా భారత ప్రభుత్వపు ప్రెసిడెంటు ఒక ప్రకటన చేయవచ్చును. ఆ సెక్షను ప్రకారంగా ఆ ప్రకటన చేయగానే, అన్ని రాష్ట్రాలమీదను కేంద్ర ప్రభుత్వం సర్వాధికారం చలాయించవచ్చును. ప్రత్యేకంగా రాష్ట్ర ప్రభుత్వములకు మాత్రమే సంబంధించిన వ్యవహారశాఖలలో కూడా కేంద్ర ప్రభుత్వం జోక్యం కల్పించుకొని, శాసనములు చేయవచ్చును. అధికారం చలాయించవచ్చును. అప్పుడు ఈ సమాఖ్య ప్రభుత్వపీఠము ఏకైకాధిపత్యపీఠముగా మారును.

నిత్యకృత్యపరిపాలనా వ్యవహార విధులకు సంబంధించిన విషయములు రాజ్యాంగ విధాన చట్టములో చేర్చకూడదుకాని, కొన్నింటిని మాత్రము యీ రాజ్యాంగచట్టములో చేర్చుట అవసరమని చేర్చితిమి. తత్సంబంధమైన నిబంధనలు 1935 సం॥ ఇండియా ఆక్టులోని నిబంధనలను అనుసరించి ఇందులో చేర్చడమైనవని, రాజ్యాంగవిధానములో చెప్పబడిన అధికారములు ఎందుకొరకు ఉద్దేశింపబడినవో అందుకొరకే సదుద్దేశములతో సంకల్పశుద్ధితో సద్వినియోగము చేయవలెను. అట్టి సంకల్పశుద్ధితో సదుద్దేశములతో ప్రభుత్వవర్గము వ్యవహరించనియెడల అధికారములు దుర్వినియోగము కాగలవు. అట్టి అధికార దుర్వినియోగము కాకుండునిమిత్తమై సదరు అధికారములను ఏ విధముగా చలాయించవలెనో నిబంధించుటకుకూడా అవసరమున్నది. సదుద్దేశములతోకూడిన అధికార సద్వినియోగమే రాజ్యాంగనీతి. అట్టి రాజ్యాంగ నీతి సాధకముల్ల సంపాదింపబడవలెనేగాని, సహజసిద్ధంగా ప్రాప్తించేది కాదు. భారత దేశము సహజంగా ప్రజాస్వాతంత్ర్య తత్వ విరుద్ధమైనది. అటువంటి యీ దేశంలో ప్రజాస్వాతంత్ర్య ధర్మమును సాధకము చేయవలసియున్నది. అధికారవినియోగము ప్రజాపరిపాలనయందు ఏ రీతిగా చేయవలెనో శాసనసభలే నిర్ణయించగలవని విడిచిపెట్టుట క్షేమకరముకాదు. అందువల్ల యీ రాజ్యాంగ విధానమందు అధికారం వినియోగ నిబంధనలు కూడా చేర్చబడెను.

### గ్రామ పంచాయితీ విధానం వ్యర్థమయినది

ప్రాచీన హిందూరాజుల ప్రభుత్వములందు గ్రామ పంచాయితీలు ఏర్పడి గ్రామాలు స్వపరిపాలితమండలములుగా నుండెననియు అట్టి స్వతంత్ర గ్రామజీవితముసే ఆధారముగా గ్రహించి భారత రాజ్యాంగ విధానమును రచించి యుండవలసినదనియు కొందరు ఆక్షేపించిరి. అనేక శతాబ్దములనుండియు గ్రామ స్వపరిపాలనము యీ దేశములో కొనసాగుచు అంతరించకుండా ఉండుటవల్ల అది యీ దేశమునకు సమర్థమైన దివ్యమైన పరిపాలనా విధానమని వాదించుచున్నారు. ఈ గ్రామ పంచాయితులనుగూర్చి మెట్కాఫ్ యీ క్రిందరీతిగా వ్రాసెను. అనేక రాజవంశములు హిందూరాజులు, మొగలులు, మహారాష్ట్రులు, ఆంగ్లేయులు యీ దేశాన్ని ఒకరితర్వాత ఇంకొకరుగా పాలించిరి సామ్రాట్టులు మారినప్పటికీ, గ్రామపంచాయితీలు మాత్రము చెక్కుచెదరకుండానే చిరకాలంగా ఉంటున్నవి. శత్రుసేనలు దాడి జరుపుచున్నప్పుడు అట్టి ఆపత్కాలములో గ్రామాలలోని ప్రజలు ఏకమై తమ పశువులను తిమసొస్తుని భద్రపరచుకొని శత్రువును ఎదిరించసుండా, శత్రుసేనలను తమ గ్రామంమీదుగా తమకు అపాయం కలుగకుండా పోనిచ్చిరి."

ఈ గ్రామ పంచాయితీలు ఈ విధంగా తమసొత్తు తమప్రాణం తాము కాపాడుకొనుచు స్వగ్రామ స్వలాభక్షేమమునే చూచుకొనుచు ఇంతకాలము వరకు అట్టి సంకుచిత స్వప్రయోజనం కొరకే అవి నిలిచియున్నవి. ఏ గ్రామానికి ఆ గ్రామం అట్టి సంకుచిత స్వగ్రామ లాభమును మాత్రమే చూచుకొనుచు వ్యవహరించుటవల్ల నీ దేశమునకు అనర్థము సంభవించినది. ఈ గ్రామ పంచాయితీలే దేశాన్ని పాడుచేసినవని నా అభిప్రాయము. సంకుచితరాష్ట్రాభిమానము, స్వకుల స్వమత స్వపంథాభిమానము ఇటువంటివి అనర్థదాయకములనివాదించెడివారు గ్రామస్వపరిపాలనా సంకుచితభావమును సమర్థింపజాలుట వింతవిషయముగా నున్నది. గ్రామజీవితము పూర్తిగా స్థానికాభిమాన దుర్వాసనా పూరితమై, అజ్ఞానకూపమై, సంకుచితదృష్టి కలుషితమై, మత విద్వేషభరితమై ఆధ్వాన్నముగా నున్నది. ఈ రాజ్యాంగ విధానములో గ్రామపరిపాలనా స్వాతంత్ర్యమును పునాదిగా స్వీకరింపక, వ్యక్తిస్వాతంత్ర్యమునే ప్రాతిపదికగా స్వీకరించడమైనది.

### అల్పసంఖ్యాక వర్గముల హక్కు రక్షణలు

అల్పసంఖ్యాకవర్గముల హక్కు రక్షణలకు సంబంధించిన నిబంధనలగూర్చి యీ రాజ్యాంగ పరిషత్తు ఇదివరలో చేసిన నిర్ణయములనే అనుసరించితిమి. అల్పసంఖ్యాక వర్గముల హక్కు రక్షణ నిబంధన అంతవరకైనని ఈ రాజ్యాంగ పరిషత్తు నిర్ణయించుట వివేకయుతము. ఈ దేశములో అల్పసంఖ్యాకవర్గములను లక్ష్యముచేయకుండా వ్యవహరించుట అధిక సంఖ్యాకవర్గముల తప్పు. అల్పసంఖ్యాక వర్గమును నదరస్థిరంగా అల్పసంఖ్యాక వర్గముగానే ఉండవలెనన్నట్లుగా కృషిచేయుటం అల్పసంఖ్యాక వర్గముల తప్పు. అల్పసంఖ్యాక వర్గములను అసంతృప్తి కలిగించేయెడల, అవి రాజ్యాన్ని క్షీణింపచేయగల అగ్నిపర్వతము వంటివి. ఈ భారతదేశములో అధికసంఖ్యాక వర్గమువారి అధికారమునకు లోబడియుండుటకు అల్పసంఖ్యాక వర్గములు అంగీకరించినవి. ఈ రెండు విషయములను పూర్వాచార పరాయణులు గ్రహింపనేరరు.

అధికసంఖ్యాక వర్గములవారు అల్పసంఖ్యాక వర్గములను ప్రత్యేకించి స్వతంత్ర భావములో మానడం మానివేస్తే అధిక సంఖ్యాకులతో అల్పసంఖ్యాకులు కూడా మిళితమై పోయెదరు అప్పటికి అల్పసంఖ్యాకులనేవారు నుండనే ఉండరు.

## "మన స్వాతంత్ర్య సౌధమును దుర్భేద్యము చేయుటే మన విధి"

### వ్యర్థ వివాదములకు ఇది సమయము కాదని ఉపప్రధాని సర్దార్ పటేల్ హెచ్చరిక

నాగపూరు, నవంబరు 3: నాగపూరు విద్యాలయ స్నాతకోత్సవ సందర్భమున సర్దారు పటేలుకు "డాక్టర్ ఆఫ్ లా" డిప్లొమా ఇచ్చి సన్మానించిరి. ఆ అవకాశమున మాట్లాడుచు పటేలు ఇట్లు చెప్పెను.

"మనము చిరకాలము పోరాడి సాధించిన స్వాతంత్ర్యమును రక్షించుకొని బలపరచుకొనుటలో భారత ప్రభుత్వమునకు సహాయపడుచు, ఈ పరిస్థితిలో తన కర్తవ్యమును గుర్తించి ఆచరించునట్లుగా విద్యార్థులకు శిక్షణ ఇచ్చుట మన విశ్వవిద్యాలయముల ధర్మము. ఈక్లిష్ట తరుణమున మన కర్తవ్యమేమి, ఇంత కష్టపడి సాధించిన స్వాతంత్ర్యమునకు మన మెంత వరకు అర్హులమై యున్నాము అని మనమందరము ఆలోచించవలెను ఈ స్వాతంత్ర్యమును దక్కించుకొని బలపరచుటకు మనమింకను త్యాగములు చేయవలెను ఒక్క సంవత్సరముల ఇక్కట్లు ఫలితముగా మనము మనకాళ్లమీద నిలబడగలిగితిమి. ఇక పుష్టి చేకూరవలెను. ఇదే మన కర్తవ్యము. ఈ స్వాతంత్ర్యమును మనము పోగొట్టుకొన్నచో ముందు తరముల వారు మనల నేమందురు? విశ్వవిద్యాలయములలో సోషలిస్టు కమ్యూనిస్టు సిద్ధాంతములనుసరించి వితర్కములను మాని విద్యార్థులు తమ బాధ్యతలనుసరించి నేర్చుకొని దేశస్వాతంత్ర్యముకొరకు త్యాగములు చేయుటకై సంపాదించుకొనునట్లు విద్యావిధానమును మార్చవలెను."

స్నాతకోత్సవమునకు రెండు వేలమంది విద్యార్థులు, 2500 మంది ఆహూతులును విశ్వవిద్యాలయాధికారులును వచ్చియుండిరి.

ఆరంభములో విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలరు పండిత కుంజీలాల్ దుబే సర్దారు పటేలు సుగుణములు కొనియాడుచు, ఆయన స్వాతంత్ర్య సమరములో అట్టి సమరతి కనబరచెనో, పరిపాలనయందు కూడ అట్టి దక్షతనే కనబరచెననీ, దేశము యొక్క గౌరవస్వాతంత్ర్యములను సాధించుటలో పూజ్య మహాత్మునికి కుడిభుజముగా పనిచేసెననియు, అశోక ప్రపంచమునకే ఆయనశీలము నూటికినూరు, పక్కా చెదరనిది, నిశ్చలమైనదనియు చెప్పెను.

విశ్వవిద్యాలయ ఛాన్సలరును, మ. ప్ర. గవర్నరును అయిన మంగలదాస్ పక్వాసా సర్దారు పటేలుకు "డాక్టరు ఆఫ్ లా" డిప్లొమా బహూకరించుచు, 25 ఏండ్ల క్రితము జెండా సత్యాగ్రహారంభమునాడు నాగపూరుకు పటేలుకు ఏర్పడిన బాంధవ్యమును స్మరించెను.

## ప్రధానివద్దకు రాయబారం

మదరాసు, నవంబర్ 4: శ్రీ నరసింహ దేవర సత్యనారాయణగారి అధ్యక్షతన ఒక రాయబారవర్గం నిన్న మధ్యాహ్నం ప్రధాన మంత్రిగార్ని దర్శించి తూ. గోదావరిజిల్లాలో రామచంద్రపురం కాకినాడ తాలూకాలలో మాత్రమేకాక, తక్కిన రెండు తాలూకాలలో కూడ ధాన్యసేకరణ కార్యం ఉత్పత్తి వినియోగదార్ల సహకార సంఘములకు ఒప్పగించుటేనే జయప్రదంగా కొనసాగును. లేకున్న అనేక చిక్కు లేర్పడునని విన్నవించిరి. అట్లు చేయ వీలులేదని ప్రభుత్వంవారు బదులు చెప్పినట్లు తెలియుచున్నది.

### 20% వంతు వివరము

మదరాసు, నవంబరు 4: ఆదుపు జిల్లాలలో ధాన్య సేకరణ చేయునపుడు ప్రభుత్వంవారు రయితుల స్వంత ఉపయోగానికి విత్తనాలకు, ధాన్యరూపమున యిచ్చే కూలీలకు కొంత విడచి అదనం సరకు ప్రమాణం నిర్ణయించేవారు. ఈ మినహాయించే మొత్తం నిరటికన్న యీ మేడు 25% అదనంగా నిర్ణయించుటకు నిన్న జరిగిన జిల్లా కలక్టరుల సభలో నిర్ణయించిరి.

## కంట్రోలు బిల్లు

చెన్నరాష్ట్ర అవసర పదార్థముల కంట్రోలు, స్వాధీనపు (తాత్కాలికాధికారములు) చట్టము 1946ను సవరించుచు ప్రభుత్వము వారొక బిల్లు ప్రకటించిరి. పై చట్టములోని సెక్షన్ 9(1) ద్వారా, డిఫెన్సు ఆఫ్ ఇండియా రూల్సు (భారత రక్షణ చట్టపు) లోని కొన్ని ఉత్తరువులమలులో నుండును. ఈ సెక్షన్ ఇంకను అమలులో నుండుట అనవసరమని భావింపబడుచున్నది. సవరణబిల్లులో ఈ సెక్షను తీసివేయబడు. ఇదిగాక ప్రస్తుతంకూడా అంపరపాక్షముగా చట్టము నిర్ణయింపబడినది. ప్రస్తుతపు ప్రకృతియు కంట్రోలు అవసరముల కూడా భావింపబడుచున్నది.

## యం. యస్. యం. రైల్లు ఆలస్యం

చెన్నపట్నం, నవంబర్ 4: జోలార్ పేట రైలులో అంబత్తూరు స్టేషన్ల వ్యవల్ల రైలుపట్టాలుగట్టులో ఒక వైపు మన్ను కరిగిపోయి ఒకపోయినందుకు కారణముగా లేకపోవుటవల్ల బెంగుళూరు మెయిలు, మంగళూరు ఎక్స్ ప్రెస్, నీలగిరి ఎక్స్ ప్రెస్ బండ్లు యీదినం 3 గం పైగా ఆలస్యముగా సెంట్రల్ కు వచ్చినవి, చెన్నపురి నుండి వెళ్లే రైళ్లు మాత్రం అట్టి ఆటంకం లేనందున ఆయా వేళకు వెళ్లెను.



### కృతజ్ఞత

శ్రీ ప. [illegible] రాజులు [illegible] [illegible] శ్రీ [illegible] [illegible] [illegible] సామాజిక [illegible] బంధుమిత్రులకు [illegible] వారి కృతజ్ఞతను [illegible]

# జ్యోతిష ఖగోళ శాస్త్రములలో గొప్ప పరిణామము.

భారతదేశపు మేటి సాముద్రిక, తాంత్రికయోగి, అంతర్జాతీయ విఖ్యాతిగాంచిన కాశీలోని వారణాసి పండితసభకును, కలకత్తాలోని ఆల్ ఇండియా అస్ట్రొలాజికల్ అండ్ అస్ట్రొనామికల్ సొసైటీకిని శాశ్వతాధ్యక్షుడు. ప్రాచ్యప్రతీచీ జ్యోతిష ఖగోళ శాస్త్రముల యందు పరిపూర్ణ విద్యావంతుడు. భావిఫలితముల చెప్పుటలో అతి మానుష శక్తిగల జ్యోతిష్య సామ్రాట్ పండిత శ్రీ రమేశచంద్ర భట్టాచార్య, జ్యోతిషార్ణవ, ఎం. ఆర్. ఎ. ఎస్. (లండన్), భారతదేశములోనే గాక ప్రపంచమంతట (ఉదా. ఇంగ్లండు, అమెరికా, ఆఫ్రికా, చైనా, జపాన్, మలయా, సింగపూరు వగైరా) అసమాన ఖ్యాతిగాంచిరనియు, కోరకుండగనే వీరి గొప్ప అతిమానుషశక్తుల నంగీకరించుచు, ప్రపంచపు మారుమూలల నుండి సుప్రసిద్ధ వ్యక్తులు యోగ్యతాపత్రికల పంపియుండిరనియు ఈ దేశములో ప్రతివారికి తెలియును.

రాజ-జ్యోతిషి

ఈ మహాశక్తిమంతుడు ఒకసారి చూసీ చూడటంతోనే ఎవరి భూత భవిష్యద్వర్తమానముల నైనను తెల్పగలడు. డాక్టర్లు, కవిరాజులు నిరాశజెందిన జబ్బులను తన యోగ, తాంత్రిక శక్తులచే నయముచేయగలడు. క్లిష్టమైన దావాలలో ప్రజలకు సహాయపడగలడు. ఆపాయములనుండి రక్షణ, వంధ్యాత్వనివారణ, కుటుంబ అసౌఖ్యములనుండి జనులకు విముక్తి కలిగింపగలడు. అతని మూడు భవిష్యత్ఫలితములు (ఆఖరి ప్రపంచయుద్ధము ప్రారంభించిన—2 వ సెప్టెంబరు 1939—ఆ రోజుననే బ్రిటిష్ విజయమునుగురించి చెప్పినజోస్యము 2 వ సెప్టెంబరు 1946 వ తేదీన పండిత జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానిగా తాత్కాలిక ప్రభుత్వముచే స్వాతంత్ర్య సంపాదనను గురించిన జోస్యము 11 ఆగస్టు 1947 వ తేదీన భారత ప్రధానమంత్రికి, భారత పాకిస్తానల భవిష్యత్తునుగురించిన జోస్యము. అటుతర్వాత అనేక వార్తాపత్రికలలో ప్రచురింపబడినవి.) వివరించిన విధముగ సరిగ జరిగినవి. ఈ ఫలితములు ప్రపంచమందంతట ప్రజల ఆశ్చర్యచకితుల జేసినవి. మరియు హిజ్ మెజస్టీ ఆరవ జార్జి, గవర్నర్ ఆఫ్ బెంగాల్, సుప్రసిద్ధ భారతీయనాయకులతో పహా నల్దిక్కులనుండి అమిత గౌరవప్రశంసల సంపాదించిపెట్టినవి. కాశీలోని వారణాసి పండిత సభచేతను, కలకత్తాలోని భారతీయ పండిత మహామండలి చేతను 1947 సం॥ రంలో జ్యోతిష సామ్రాట్ - ఖగోళ శాస్త్రజ్ఞులలోను జోస్యులలోను సార్వభౌముడు-అను బిరుదముతోను, 1938 సం॥ రంలో "జ్యోతిష శిరోమణి" అను బిరుదముతోను భారతదేశంలో గౌరవింపబడిన జ్యోతిష్కుడు ఈయనొక్కరే. పండిట్‌జీ ఇప్పుడు భారతదేశంలో పదునెనిమిదియుండి సంస్థానపాలకులకు జ్యోతిష సలహాదారుగా వున్నారు. భారతదేశంలో ఇంతవరకు ఏ జ్యోతిష్కునికి లభ్యంకాని మహోత్తమ గౌరవమిది.

అన్ని ఆశలూ కోల్పోయిన వ్యక్తులు పండిట్జీ యొక్క శక్తులను పరీక్షింపవలయునని కోరబడుచున్నారు.

## అద్భుత తాయెత్తులు (గ్యారంటీ)

పనిచేయనిచో డబ్బు వాపసు.

**ధనదకవచము, లేక రొత్సుచైల్డు తాయెత్తు:**—దీనిని ధరించినవారు శార్ధి శ్రమతో అధికధనాన్ని ఆర్జించగలరు. ఎప్పుడైనా, దేన్ని గురించైనా తలుచుకున్నంత మాత్రాన అది చేకూరుతుంది. లక్ష్మీదేవి వారిఇంట్లో చిరస్థాయిగా వుండి, పుత్రసంతానం, అపారసంపద, దీర్ఘాయువు, పేరుప్రతిష్ఠలు చేకూర్చును. దరిద్రుణ్ణికూడ (తంత్రములో వ్రాసియున్న ప్రకారం) రాజువలె ధనవంతుని చేయును. వెల రు. 7-10-0 ప్రత్యేకపుది, శీఘ్రప్రయోజనాన్ని కల్గించగల ప్రభావం గలది. రు. 29-11-0. అత్యధిక ప్రయోజనం గల సూపర్ స్పెషల్ రు. 129-11-0.

**బగళాముఖి కవచము:**—ఇది మీ శత్రువులను జయించుటకు తోడ్పడును. ఈ కవచ ప్రభావంవల్ల దీనిని ధరించినవారు ఉద్యోగంలో అభివృద్ధి, అధికారుల ప్రాపకము పొందగలరు. సివిల్, క్రిమినల్ వ్యాజ్యములలో గెలుపుచేకూర్చుటకు సాటిలేనిది. ఇది అన్ని ప్రమాదములకు, అపాయములకు రక్షణము. వెల రు. 9-2-0 ప్రత్యేకపుది శీఘ్రప్రయోజనాన్ని కలిగించేది. రు. 34-2-0 (భోవాల్ కేసును గెలిచిన భోవాల్ కుమార్ దీనిని ధరించిరి) అధిక ప్రయోజనం గల సూపర్ స్పెషల్ రు. 184-4-0.

**మోహిని కవచం:**—కోరినవారిని తప్పక చెప్పు చేతలలోనికి తీసుకొని వచ్చును. వెల రు. 11-8-0 ప్రత్యేకపుది, సత్వర ప్రయోజనకారి రు. 34-2-0 అత్యధిక ప్రయోజనం గల సూపర్ స్పెషల్ రు. 387-14-0.

**నృసింహ కవచము:**—ఈ కవచము ధరించినయెడల స్త్రీల వంధ్యాత్వము పోవును. స్త్రీల జబ్బులు కుదురును. మాత్తికదుపులో గడ్డ కట్టుకున్న రక్తము పనేలును. బహిష్టు సక్రమమగును. దయ్యములనుండి భూతములనుండి రక్షించును. వెల రు. 7-5-0. శీఘ్ర ఫలితములకూర్చు స్పెషల్ రు. 13-9-0 సూపర్ స్పెషల్ రు. 63-9-0.

**సరస్వతి కవచము:**—పరీక్షలలో తరచుతప్పి, జ్ఞాపకశక్తిలేక ఖిన్నులై జీవితం గడిపేవారు దీనిని ధరించాలి. ధర రు. 9-9-0 స్పెషల్ రు. 38-9-0 సూపర్, జీవిత పర్యంతమూ మంచిఫలితాలు ఇచ్చేది రు. 427-13-0. జాబులుయింగ్లీషులో వ్రాయవలెను. యోగ్యతాపత్రములతో వివరములు గల కేట్లాగు కోరినవారికి ఉచితముగా పంపబడును.

## ఆల్ ఇండియా అస్ట్రొలాజికల్ అండ్ అస్ట్రొనామికల్ సొసైటీ.

రిజిష్టర్డు (స్థాపితం : 1907 A. D.)

(మా ప్రాచ్యంలోనూ భారతదేశంలోనూ నమ్మకమైన, పురాతన అస్ట్రొలాజికల్ సొసైటి) హెడ్డాఫీసు : 105 (A. P.) గ్రేస్ట్రీట్, 'బసంత్ నివాస్' కలకత్తా (శ్రీశ్రీ నవగ్రహ అండ్ కాళీదేవాలయం.) సంప్రదించు వేళలు : ఉదయం 8-30 మొదలు 11 వరకు ఫోను బి. బి. 3685, బ్రాంచి ఆఫీసు : 47 ధర్మతుల్లావీధి (వెల్లెస్లీ జంక్షన్) కలకత్తా, ఫోను Cal 5742. సంప్రదించు వేళలు : సాయంత్రం 5 మొదలు 7 వరకు. లండన్ ఆఫీసు:- మిస్టర్ ఎం. ఎ. కర్టిన్ 7-A, వెస్ట్‌వే, రేనెస్‌పార్కు, లండన్.

# "ఢిల్లీ" యుద్ధనౌక

## మదరాసులో ప్రజలకు చూపే ఏర్పాటులు

చెన్నపట్నం, నవంబరు 3: శుక్రవారం, నవంబర్ 5 నాడు భారత నావికాదళపు ప్రధమ క్రూయిజర్ హెచ్. యం. ఐ. యస్. ఢిల్లీ, చెన్నపట్నం రేవుకు వచ్చును. ఈ క్రూయిజర్‌తో పాటు హెచ్. యం. ఐ. యస్. కృష్ణ - హెచ్. యం. ఐ. యస్. సట్లెజ్ అను రెండు స్లూపులు కూడా రాగలవు.

ఈ ఓడలు యీనెల 5 తేదీనాడు ఉదయము 10 గంటలకు రేవులోనికి రావచ్చును. హెచ్. యం. ఐ. యస్. ఢిల్లీ, రేవులో ముఖ్యమైన మధ్య 'బెర్తు' వద్దనుండును. ఈ ఓడలవెంట వచ్చుచున్న ఉన్నతాధికారులలో ముఖ్యులు : ఫ్లాగ్ ఆఫీసర్ కమాండింగ్, రియర్ అడ్మిరల్ జె. టి. యస్. హాల్. కమాండింగ్ ఆఫీసర్ కెప్టెన్ హెచ్. యం. యస్. బ్రౌన్, రెండవ కమాండింగ్ ఆఫీసర్. కెప్టెన్ కరారి. కెప్టెన్ కరారి ఆంధ్రుడు. భారత నావికా దళములోనున్న భారతోద్యోగులలో ముఖ్యుడు. ఇంగ్లండులో యుద్ధనౌకలపై పని చేయుటలో ప్రత్యేక శిక్షణను పొందిరి. ఈ మూడు ఓడలలో ఏ కొద్దిమందియో తప్ప అందరునూ భారతీయులే. "ఢిల్లీ"పై 60 మంది ఆఫీసర్లు, 750 మంది రేటింగులు కలరు. మిగిలిన రెండు స్లూపులలో, ఒక్కొక్కదానిపై 12 మంది ఆఫీసర్లు 200 మంది రేటింగులు కలరు.

నవంబర్ 5 నాటి ఉదయము 10 గంటలకు ఓడలు రాగానే చెన్నపట్నం రెసిడెంట్ నేవల్ ఆఫీసర్ కెప్టెన్ యస్. పి. యస్. నాయర్, రియర్ అడ్మిరల్ హాల్‌కు స్వాగతమిచ్చును. 11 గంటలకు హాల్‌గారు సైనికాభినందనమును స్వీకరింతురు. రాత్రి 8-30 కు శ్రీమతి సుబ్బలక్ష్మిచే, నావికా సిబ్బందికై రాజాజీ హాలులో పాటకచ్చేరి.

శనివారం 6-11-48 నాడు ఉదయం 9-30 నుంచి 12-30 వరకు ఆపైన 2-30 నుంచి 5-30 వరకు ప్రజలు ఈ ఓడలను చూచుటకేర్పాటు చేయబడును. చూడవచ్చువారు వరుసలో నిలబడి, సుశిక్షణతో ప్రవర్తింపవలెనని రెసిడెంట్ నేవల్ ఆఫీసర్ విన్నవించుచున్నారు. రాత్రి 9.30కు ఇండియన్ హాస్పిటాలిటీ కమిటీవారు శ్రీమతులు లలిత, పద్మిని, రాగిణిలచే, నావికా సిబ్బంది కొరకు నాట్యప్రదర్శనము నేర్పాటు చేయుదురు. ఈ ప్రదర్శనమునకు మేజర్ జనరల్ రాజేంద్రసింగ్‌జీ, మే. జ. చౌధరి మే. జ. రుద్రమొదలైనవారు వత్తురు.

ఆదివారం 9 నుంచి 11 గంటలవరకు కొందరు స్త్రీలు ఓడను చూచుదురు. రాత్రి 8-30 కు విజయవాడ సైనికసహాయ సమితివారు రాజాజీహాల్‌లో బేబీ కమల నాట్యము నేర్పాటుచేయుదురు.

సోమవారంనాడు 9 నుంచి 12 వరకు తిరిగి 2 నుంచి 4-30 గంటల వరకు నగర విద్యార్థులు ఓడలను చూచుటకై ప్రత్యేక ఏర్పాటులు చేయబడినవి. రాత్రి 8-30 గంటలకు శ్రీ టి. సుందరరావు నాయుడు తమ సన్ థియేటర్‌లో రేటింగ్‌ల కొరకై ఉచిత సినిమా ప్రదర్శనము నిత్తురు.

మంగళవారం ఉదయం 9 నుంచి 12-30 గంటలవరకు తిరిగి ప్రజలు చూడవచ్చును. బుధవారంనాడు ఈ ఓడలు విశాఖపట్నమునకు ప్రయాణముకాగలవు.

కార్యక్రమములో ఈ అంశములు గాక గవర్నరుతో, ప్రధానితో, మేయర్‌తో, అల్పాహారవిందులు, ఒడపైన కాక్‌టైల్ పార్టీలు, నాట్యములుకూడా నున్నవి. నగరమునకు ఈ ఓడలరాకను, భారతనావికావారోత్సవతుల్యముగా జరుపవలెనని, అధికారులు ఉత్సాహపడుచున్నారు.

## చంద్రమౌళిగారికి తిరువళ్లూరు మున్సిపాలిటీ సత్కారం

స్థానికశాఖామాత్యులు కల్లూరి చంద్రమౌళిగారికి సోమవారం సాయంత్రం తిరువళ్లూరు పురపాలకసంఘంవారు సన్మానపత్రమిచ్చి పురపాలకసంఘంవారి ఇబ్బందులను వివరించిరి. విద్యుచ్ఛక్తిని వ్యవసాయమునకు వినియోగించ నియ్యవలెననియు సుఖాధార, వసతి, మంచినీళ్లవసతి ఏర్పరచవలెననియు రోడ్లు కావలెననియు విజ్ఞప్తిలో తెలిపిరి. మంత్రిగారు సన్మానమునకు కృతజ్ఞత తెలుపుచు, తిరువళ్ళూరులో ఆనారోగ్య పరిస్థితులు చూచియే తాము దానిని పురపాలకసంఘముగా మార్చితిమనియు, ఇది అయి ఆరుమాసములు కాలేదనియు, విస్తుకేసిన వంటనే ఫలములు రాలేదని ఆత్రపడి లాభములేదనిరి. కాంగ్రెసు మంత్రులు అస్పృశ్యతా నివారణకు మద్యనిషేధమునకు, జమీందారీల రద్దుకు తెచ్చిన మహాశాసనముల వివరించుచూ మహాత్ముని అడుగుజాడలలో ప్రతివారును నడుచుటకు యత్నించిన దేశమునకు విమోచన ఉండుననిరి, ప్రతివారునూ ఉత్పత్తికి తోడ్పడవలెననిరి. గాంధీ దంపతుల శిలావిగ్రహముల మంత్రిగారు ఆవిష్కరించిరి.

# గాంధీజీ చిత్రపటావిష్కరణ

ప్రెసిడెన్సీకాలేజి ఇంగ్లీషుహాలునందు మదరాసు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డా॥ ఎ. లక్ష్మణస్వామి మదల్యారుగారు గాంధిమహాత్ముని పటమును మంగళవారం సాయంకాలం ఆవిష్కరించిరి. మేయరు డా॥ యు. కృష్ణారావుగారు సభాధ్యక్షత వహించిరి. గాంధిమహాత్ముడు యుగపురుషుడనియు, వారి సందేశాలకు, బోధలకు చావులేదు. గనక వారు గతించినప్పటికి మనలను విడువలేదనే ఎంచవలెనని, డా॥ మదల్యారుగారు తెలిపిరి.

## శిశుపోషణ నిమిత్తం అంతర్జాతీయ సంస్థ

### మదరాసుశాఖ ఏర్పాటు

మదరాసు, నవంబరు 3: సంయుక్త రాజ్యాల శిశుపోషణ సంఘం మదరాసు శాఖ నేడు గవర్నరు భావనగరు మహారాజాగారి అధ్యక్షతను ఏర్పడెను. నేడు కోటలో జరిగిన సభకు హాజరయినవారంతా సభ్యులుగ నొక కార్యవర్గము ఎన్నుకోబడెను. భారతీయ శాఖాసంఘం రాజకుమారి అమృతకౌరు గారి అధ్యక్షతను ఏర్పడెను. శిశువులకు, బాలురకు, బాలింతలకు అవసరమగు సహాయం చేయుటకై ధనం ప్రోగుచేయుటే యీ సంఘం యొక్క ముఖ్యోద్దేశము. పువ్వుల మేళ్ళ దినమొకటి ఏర్పాటు చేయుదురు. ప్రతివారు ఒకరోజు జీతం చందాగా యిమ్మని విన్నపం ప్రకటింతురు.

### ఉపాధ్యాయులు-రాజకీయాలు

మదరాసు టీచర్సు గిల్డుసభయందు ఉపన్యసించుచు, పచ్చయ్యప్ప కాలేజి ప్రిన్సిపాలు ఆర్. కృష్ణమూర్తి గారు, ఉపాధ్యాయులు రాజకీయాలకు దూరంగా నుంటే విద్యార్థుల సహకారము అభిమానము సామరస్యమును ఎక్కువగ పొందగలరని సలహా చేసిరి.

### డిటెన్యూల విడుదల

ప్రజారక్షణచట్టంప్రకారం నిర్బంధింపబడిన నల్గురు గుంటూరు డిటెన్యూలను ప్రభుత్వంవారు విడుదల చేసిరి.

తూర్పు కృష్ణజిల్లాలకు కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం యీనెల 8వ తేదీన జరుగును.

మదరాసులో గతవారమునందు 23 పాలకల్తీ కేసులు, 4 వెన్నకల్తీ, 3 నూనెకల్తీ కేసులను మొత్తం 30 కేసులను ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటులు విచారించి జరిమానా శిక్షలు విధించిరి.

### ఉద్యోగుల మార్పులు

బళ్లారి జాయింటు సబ్ రిజిస్ట్రారు సి. హెచ్. రామకృష్ణయ్యగారిని అనంతపురంజిల్లా రిజిస్ట్రారుగా (భీమాలు)నియమించిరి. అనంతపురంజిల్లా రిజిస్ట్రారు (భీమాలు) యస్. బి. సన్యాసి గారిని పశ్చిమ గోదావరిజిల్లా రిజిస్ట్రారుగా (భీమాలు) నియమించిరి. పశ్చిమ గోదావరి జిల్లా రిజిస్ట్రారు (భీమాలు) యం. సుందరరామయ్యగారిని గుంటూరుజిల్లా రిజిస్ట్రారు (భీమాలు) గా నియమించిరి. గుంటూరులో ఉన్న కె. సత్యనారాయణ గారు ఉద్యోగమునుంచి విరమించుటకు ముందు సెలవు తీసుకొన్నారు.

కర్నూల్ జిల్లా రిజిస్ట్రారు (భీమాలు) వి. వి. సత్యనారాయణగారిని కృష్ణాజిల్లా రిజిస్ట్రారుగా నియమించిరి. ఆర్. రామమూర్తి అయ్యర్ గారికి సెలవు యివ్వబడింది.

సయ్యద్ బషీరుద్దీన్ గారిని తుంగభద్ర ప్రాజెక్టు కాలువల నిర్మాణ శాఖలో హాస్పేటశాఖకు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు గా నియమించిరి. డి. విశ్వనాథన్ గారు అసిస్టెంటు ఇంజనీరుగా పనిచేసెదరు.

సి. ఆర్. శ్రీనివాసయ్యంగారు, బాపట్ల వ్యవసాయ కళాశాల ప్రిన్సిపాలుగ నియమింపబడిరి.

డి. కె. సుకుమారనుగారు, గిండీ ఇంజనీరింగు కాలేజి ప్రొఫెసరుగ నియమింపబడిరి.

కె. పి. ఎల్. షినాయిగారు, విశాఖపట్నంజిల్లా కలెక్టరుగను, ఎ. ఉత్తాండం పిళ్లై, ఎన్. ఎస్. అరుణాచలంగార్లు, సివిలు సప్లయిసు డిప్టీ కమిషనర్లుగను నియమింపబడిరి.

విద్యా ఆరోగ్యశాఖలో జాయింటు సెక్రటరీ పదవిని మదరాసు ప్రభుత్వంవారు రద్దుచేసిరి. ఆ పదవియందున్న సి. ఒ. కూరే గారు ఐ. సి. ఎస్. ఉద్యోగమునుండి విరమించిరి. టి. గోవిందమీననుగారు ఆ శాఖలో డిప్టీ కార్యదర్శిగను, కె. సోమసుందరంగారు అసిస్టెంటు కార్యదర్శిగను నియమింపబడిరి.

కృతజ్ఞతాంజలులను, పుష్పమాలలను అర్పించిరి. తిరువళ్లూరులోని రోడ్లను పేదవాడలను తనిఖీచేసిరి. సాయంత్రం మంత్రిగారు సతీసమేతముగా శ్రీ వీరరాఘవస్వామి దర్శనము చేసుకొని రాత్రి మదరాసు చేరిరి.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T., Madras.